

UMA 1036-958
CHAIN WITH
RS. 7-50
MARY WITH CHILD DOLLER
UMA 1037-957
CHAIN WITH SITA RAMA
RS. 7-50
LAKSHMANA & HANUMAN DOLLER
UMA 1038-714
CHAIN WITH HANUMAN DOLLER
RS. 7-50
UMA 1039-961
CHAIN WITH SRI RAMA PATTABHISHEKAM DOLLER
RS. 7-00
UMA 627-804
BLACK BEEDS CHAIN WITH JAYA LAKSHMI DOLLER
RS. 8-50

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# Have Fun When You Travel... with

## GEVABOX





Travel opens fun-filled, exciting opportunity
to explore with your camera.
Assure yourself of memorable pictures on your
next vacation—with a GEVABOX...
a box camera with a difference

**EXCLUSIVE features:**

* A smart, well-finished, strongly made camera of all-metal construction
* Direct vision eye-level viewfinder permits upright and horizontal pictures
* Shutter speeds of 1/50 and 1/100 seconds
* Eight exposures of 21/4" x 31/4" size
* Synchronised for flash
* Easy film changing



*Have a look at the GEVABOX Camera at our dealers*

**GEVABOX** for everyone, everywhere

---

**ALLIED PHOTOGRAPHICS LIMITED**

Kasturi Building, Jamshedji Tata Road, Bombay.

*Subscribers who need changes in their addresses are requested to write to us before the 5th of a month, mentioning their subscription number. Requests received after that date will receive attention only during the first week of the subsequent month. Their co-operation is solicited.*

CIRCULATION MANAGER.

# వైట్ హార్స్ సబ్బు




**WHITE HORSE SOAP**

.... గుడ్డల మురికిని పోగొట్టుటలో
అగ్రస్థానము వహించినది.
పట్టు, లినన్ గుడ్డల చలువకు శ్రేష్ఠమైనది.

బారు ఒకటి: రు. 1–00
పెద్ద సైజు కేకు: 0–31 న. పై.
మీడియం సైజు: 0–19 న. పై.
శాంపిల్ సైజు: 0–07 న. పై.

తయారుచేయువారు:
డి. బంగారుశెట్టి
నేషనల్ ఇండస్ట్రీస్,
మదరాసు - 21
ఫోన్—ఫాక్టరీ: 51388 :: ఆఫీసు: 24115

---

మృదువైన చర్మమునకు
## ఫెస్టివల్
## సూపర్ సాండల్ టాల్కం పౌడర్ అండు స్నో






ఫోన్: 51388 మురళి ట్రేడర్స్ మదరాసు-21 తంతి: "Mursoks"

ప్రతిచోటా దొరకును
ఆంధ్ర ప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు:—M/s. శివకోటి లక్ష్మీనరసింహం,
మార్కెట్ స్క్వేర్ :: విజయవాడ

# BEST BY EVERY TEST

POWER DRIVEN CALENDAR
**RIMMING**

OFF-SET PLATE
**WHIRLER**





**POWER DRIVEN**
**CALENDAR RIMMING MACHINE**

Made out of selected
materials.
Handsome Finish

**OFF-SET PLATE WHIRLER**

Made out of Best
materials. Continuously valuable speed-Oil
bath DRIVING.




**Sarada**
**ENTERPRISES**

*FOR THE PARTICULARS PLEASE CONTACT:*

2 & 3, ARCOT ROAD,

VADAPALANI. :: MADRAS - 26.

దీపావళి శుభాకాంక్షలు

బంగారు, వజ్రముల నగలకు ప్రసిద్ధిచెందినది







# ఉమ్మిడియార్స్



## ఉమ్మిడి రామయ్యచెట్టి గురుస్వామిచెట్టి & కో.,

హెడ్డాఫీసు :
23/25, ఎన్. ఎస్. సి. బోస్ రోడ్డు,
మదరాసు - 1
ఫోన్ : 31902, 31758

★

బ్రాంచి :
ఎల్. ఐ. సి. బిల్డింగ్,
మౌంట్ రోడ్డు, మదరాసు - 2
ఫోన్ : 84488

# పాఠకుల లేఖలు

## నవంబర్ 1962

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య "కుమార నంభవం" చూస్తున్నాను. వారి గేయ కథలు అనంఖ్యాకులైన పాఠకుల మెప్పును పొందడం నేను బాగా ఎరుగుదును. "కుమారనంభవం" కూడా వారు ఉదాత్తంగా, నరళమైన భాషలో మధురంగా వ్రాస్తున్నారు. పూర్వ కథ ఔచితిని పాటిస్తూ సమకాలీన ప్రజాభిరుచికి అనుగుణంగా ఇటువంటి ఇతి వృత్తాలను గేయ కథలలో మలచటం అసామాన్యమైన పని. అటువంటి కృషి చేస్తున్నందుకు శ్రీ ఉత్పలను, ప్రోత్స హిస్తున్న మిమ్ములను అభినందిస్తున్నాను.

—సంగరాజు లింగమూర్తి, హైదరాబాద్

ఈ నెలలో వెలువడిన కథలు అన్నీ ఆకర్షించాయి. "రాజైన బానిసపిల్ల" సీరియల్ చాలా రస వంతముగా యున్నది.

—డి. ఇ. సత్యన్నారాయణ, పారశెల్లి

వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి, చదివితే "రాజైన బానిసపిల్ల" చదవాలి.

తాతిని వెంకటగిరి నరసింహమూర్తి, మోర్త

"రాకాసిలోయ", "అరణ్యకాండ" సీరియల్ చదివిన తరవాత కూడ మళ్ళీ మళ్ళీ చదవాలని పిస్తుంది.

—గోరు చంద్రభూషణరావు, పలాసా

అక్టోబరు "చందమామ"లోని "రాకాసిలోయ" సీరియల్ చాలా అద్భుతముగా నున్నది. "ప్రభు ధిక్కారం", "గుణపాఠం", "పెళ్ళి గండం" కథలు చాలా బాగున్నవి.

—తనికెళ్ళ వెంకటరమణశాస్త్రి,
మృత్యుంజయనగరం

ఉత్తమమైన డిజైన్లలో ఎన్నికైన టైపులను

ఇంగ్లీషు - తమిళం - మలయాళం - భాషలలో 

సప్లయి చేయగలము



ఇవి గాక

పర్ఫొరేటర్లు, హార్డ్ ప్రెస్సులు,

ట్రెడిల్సు, కటింగ్ మిషనులు,

ఇతరములైన

సమస్త ముద్రణ పరికరాలు మీకు

కావలసిన రీతులలో తగిన

వెలలకు మావద్ద దొరుకును.

# ది మద్రాసు టైప్ ఫౌండ్రి

**38,** జోన్స్ స్ట్రీట్ :: మద్రాసు **- 1**

# వాటర్‌బరీస్ కాంపౌండ్

## ఎర్ర లేబిలు

వీటికి దివ్యముగా పనిచేస్తుంది : దగ్గు మరియు జలుబు ఇన్‌ఫ్లుయంజా, గొంతు అస్వస్థతలు, ఉబ్బసము




ఒక్క మందు మాత్రమే కాదు

**ఒక నమ్మకమైన టానిక్ కూడ!**

చాలఏళ్ల పరీక్షలు జరిపి కనుగొన్న ఫార్ములానుండి తయారుచేయబడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ నమ్మకమైన టానిక్కు మరియు దానిని వాడమని డాక్టర్లు సిఫార్సు చేస్తారు.

**చికిత్సగా ఉపయోగము :** వాటర్‌బరీస్ కాంపౌండ్‌లో కఫహరములగు క్రియొసోట్ మరియు గయాకోల్ కలవు. అవి వాయునాళాలను శుభ్రపరుస్తాయి, దగ్గు మరియు జలుబును త్వరితముగా మరియు గుణము కలిగించేలా అడ్డుతాయి.

**టానిక్‌గా ఉపయోగము :** రోగములు రాకుండా మరియు తరుచుగా వ్యాపించే అంటు వ్యాధులు సోకకుండా అడ్డుటలో, దేహములో శక్తి నిలవలను హెచ్చుచేయుటలో వాటర్‌బరీస్ కాంపౌండ్ సహకరిస్తుంది, ఆకలిపుట్టిస్తుంది, జీర్ణముగుటలో సహకరిస్తుంది, రక్తమును శుభ్రపరుస్తుంది, మరియు ఖనిజ లవణముల నష్టమును భర్తీ చేస్తుంది

WCRY-I-TEL

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ ( పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఎ. లో స్థాపితము )




దీపావళి పండుగకు
మీకు
సిరిసంపదలు...







పద్మశ్రీ వారి
సిరిసంపదలు
దర్శకుడు... పి. పుల్లయ్య. B.A
ఆంధ్ర, సీడెడ్... విజయ రిలీజ్ - నైజాం, మైసూర్.. ఈస్టిండియా రిలీజ్..
నిర్మాత.. వి. వెంకటేశ్వర్లు. B.A....
VANAJA




రిజిస్టర్డు నం: 119923

# డైమండ్ సుగంధ వక్క పొడి

## ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధి చెందినదిన్ని. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

పొట్లం ఒకింటికి 2 న. పై. మాత్రమే.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్‌బజార్ - బళ్ళారి - 1.

—: సేల్సు డిపోలు :—

చీరాల, గుంటూరు, మాచెర్ల, కర్నూలు, ఆదోని, హుబ్లి, తిరుపతి, హైద్రాబాద్, రాయచూరు, బెంగళూరు, చిత్రదుర్గం, కంబమ్.


MICO







## "కోప్ ఫాబ్రిక్స్"

చేనేత వస్త్రాలనే ధరించండి

★

నూతన డిజైనులలో చీరెలు, జాకెట్టు గుడ్డలు షర్టింగులు, దుప్పట్లు, చలువ చేసి క్యాలెండరు చేయబడిన మల్లులు, లాంగ్‌క్లాతు, పాప్లిన్లు, ఛెక్ షర్టింగులు, వగైరా మీ కుటుంబమునకు కావలిసిన అన్నిరకముల వస్త్రములు

మా విక్రయశాల లన్నింటిలో లభించును.

★ ★ ★

పక్కారంగులు, ఎక్కువ మన్నిక సరసమైన ధరలు.

★

రూపాయికి 5 న. పై. రిబేటు

★

ఆంధ్ర చేనేత సహకార సంఘము లిమిటెడ్

విజయవాడ — 2



ఆఫ్ఘన్ స్నో
సౌందర్య పరికరాలు
మీ ముఖ వర్చస్సునూ,
శరీరచ్ఛాయనూ,
శిరోజాలనూ, గోళ్ళనూ
సౌకుమార్యముగా సంరక్షించును...
మీ సౌందర్య సమస్య లన్నింటినీ
పరిష్కరించుకోండి....

ఆఫ్ఘన్ స్నో

సౌందర్య పరికరాలు

తయారు చేయువారు:

ఇ. ఎస్. పటన్‌వాలా,

బొంబాయి - 77.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మళ్ళీ దీపావళి వచ్చింది. మా పాఠకులకు దీపావళి విశేష సంచిక అందజేస్తున్నాం. మామూలు కథలూ, శీర్షికలూ, రంగుల బొమ్మల కథలూ గాక ఇందులో రంగుల వాష్ డ్రాయింగ్ చిత్రాలు గల "సర్ప యాగం", హనుమంతుడి జీవితానికి సంబంధించిన ఘట్టాలు గల బొమ్మల కథా ఉన్నాయి. ఇవి మా పాఠకులకు ఆనందం చేకూర్చుతాయని ఆశిస్తాము.

ఈ సంచికలోనే "గుండు భీమన్న" కథలు తిరిగి ఆరంభమవుతున్నాయి. ఇవి కూడా పాఠకులకు వినోదం కలిగిస్తాయని మా ఆశ.

దీపావళి శుభ సమయంలో మా పాఠకుల కందరికీ "చందమామ" తరఫున శుభా కాంక్షలు.

సంపుటి : 31 నవంబర్ 1962 సంచిక : 5



# భారత చరిత్ర



పల్లవుల బద్ధ శత్రువులు చాళుక్యులు. వీరి ప్రభ కర్ణాటదేశంలో 6 వ శతాబ్దంలో ఆరంభమయింది. వీరి తొలి రాజధాని వాతాపి (బాదామి). వీరి మూలపురుషుడు మొదటి పులకేశి. ఇతని కొడుకులు మొదటి కీర్తివర్మా, మంగలేశుడూ కూడా కొంకణ, వైజయంతి, దక్షిణ మహారాష్ట్ర, మాల్వ దేశాలను జయించి చాళుక్య సామ్రాజ్యాన్ని నలువైపులా విస్తరింప జేశారు. కీర్తివర్మ కొడుకైన రెండవ పులకేశి చరిత్రప్రసిద్ధుడు. ఇతను 609 నుంచి 642 దాకా ఏలాడు. ఇతను దక్కను యావత్తూ జయించి గౌతమీ పుత్ర శాతకర్ణిని మరిపింప జేశాడు. హర్షుణ్ణి ప్రతిఘటించాడు. పల్లవ మహేంద్రవర్మ దర్పం అణచాడు. పిష్టపుర (పిఠాపుర) రాజ్యాన్ని జయించి దానికి తన తమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుణ్ణి రాజుచేశాడు. కాని ఇతని హయాంలోనే పల్లవ నరసింహవర్మ ఇతన్ని ఓడించి, వాతాపిని మట్టిపాలుచేశాడు.

అయితే చాళుక్యుల ప్రతిభ అంతటితో అంతరించి పోలేదు. రెండవ పులకేశి కొడుకైన మొదటి విక్రమాదిత్యుడు తన శత్రువులైన పల్లవులతో తిరిగి పోరు ప్రారంభించాడు. ఈ పోరాటం మరింతగా సాగించి కృతకృత్యుడైన వాడు ఇతని మనమడు రెండవ విక్రమాదిత్యుడు. ఇతను పల్లవ రాజధానిని లోబరచుకున్నాడు కూడా. రెండవ విక్రమాదిత్యుడి కుమారుడి కాలంలో చాళుక్య ప్రతిభ అంతమై, రాష్ట్రకూటుల ప్రతిభ తల ఎత్తింది. అఖరు చాళుక్యరాజు పతనానికి కారకుడు అతని సేనానాయకుడైన దంతిదుర్గు డనేవాడు.

ఇతను పునాది వేసిన రాష్ట్రకూట సామ్రాజ్యం మహారాష్ట్ర, కర్నాట ప్రాంతాలాక్రమించింది. రాష్ట్రకూటులు తమ

## 14. చాళుక్యులు, రాష్ట్రకూటులు



మూలపురుషుణ్ణిగా కృష్ణుడి తమ్ముడైన సాత్యకిని చెప్పుకుని, తాము యాదవుల మన్నారు. వారు తెలుగుదేశపు రెడ్డివంశం వారని కొందరు చెబుతున్నారు. రాష్ట్రకూటులు ఆంధ్రదేశపు రైతులని తూర్పు చాళుక్యుల పత్రాల ద్వారా తెలుస్తున్నది. వీరు ఒకప్పుడు నిజాము రాజ్యంలోని లట్టలూరు గ్రామానికి నాయకులుగా ఉండినట్టు సాక్ష్యం ఉన్నది.




రాష్ట్రకూట సామ్రాజ్యం ఉచ్చలో ఉన్న కాలంలో ఉత్తరాన, దక్షిణ గుజరాతు, మాల్వా, బాఘేల్‌ఖండ్‌ల దాకానూ, దక్షిణాన తంజావూరు దాకానూ విస్తరించి ఉండేది. పల్లవులు కన్యాకుబ్జ చక్రవర్తిని ప్రతిఘటించటం మాత్రమే చేశారుగాని రాష్ట్రకూటులు, మహీపాల ప్రతిహారుడు రాజ్యం చేసే కాలంలో, కన్యాకుబ్జాన్నే ముట్టడించారు. రాష్ట్రకూటులు ఇంత సామ్రాజ్యాన్ని ఏర్పరచినప్పటికీ, తూర్పు తీరాన గోదావరీ కృష్ణానదీ ముఖప్రాంతాలు రాష్ట్రకూటుల వశం కాలేదు; వాటిని చాళుక్య వంశపు రాజులే పరిపాలిస్తూ వచ్చారు. మాన్యఖేటాన్ని పరిపాలించిన రాష్ట్రకూట రాజు, వల్లభరాజు, ప్రపంచపు మహా చక్రవర్తులు నలుగురిలో ఒకడని ఆ కాలపు అరబ్బీ రచయితలు ప్రశంసించారు. (మిగిలిన ముగ్గురు చక్రవర్తులు—చీనా చక్రవర్తీ, బాగ్దాదు ఖలీఫా, కాన్‌స్టాంటి నోపిల్ చక్రవర్తీ.)

రాష్ట్రకూట రాజులు సారస్వతాన్ని పోషించారు. మొదటి అమోఘదర్షు డనే వాడు ప్రఖ్యాత కవి. ఎల్లోరాలో కైలాసనాథాలయం చెక్కించిన వాడు మొదటి కృష్ణుడనే వాడి దంతిదుర్గుడి ముందు తరానికి చెందిన రాష్ట్రకూటుడు. చాళుక్యులు కంచిలోని పల్లవులతో పోరాడినట్టే, రాష్ట్రకూటులు కన్యాకుబ్జపు ప్రతిహారులతో పోరాటాలు సాగించారు. మొదటి కృష్ణుడి చిన్న

కొడుకు ధృవుడనేవాడు ప్రతిహార వత్స రాజును ఓడించాడు. ధృవుడి కొడుకైన మూడవ గోవిందుడి కాలంలో రాష్ట్ర కూటులు అజేయు లనిపించుకున్నారు. కంచి పల్లవులు వారికి కప్పం కట్టారు; దక్షిణ గుజరాతులో రాష్ట్రకూట వంశీయుడు రాజ్యం ఏలాడు. వత్సరాజు కొడుకు రెండవ నాగభటుడూ, వంగరాజు చక్రాయుధుడూ వారికి లొంగిపోయారు.

815 నుంచి 877 దాకా పాలించిన మొదటి అమోఘవర్షుడు తన రాజధానిని నిజాం రాష్ట్రంలోని మాన్యఖేటం (మళ్ఖేడ్)కు మార్చాడు. ఈయన గోదావరీ కృష్ణా తీరాల లోని వేంగీ చాళుక్యులతో పోరాడాడు. ఇతని ముని మనమడు మూడవ ఇంద్రుడు ప్రతి హార మహీపాలుణ్ణి జయించి, కన్యాకుబ్జాన్ని తాత్కాలికంగా ఆక్రమించ గలిగాడు.

రాష్ట్రకూటులలో చెప్పదగిన ఆఖరు రాజు మూడవ కృష్ణుడు. ఇతని కాలంలోనే రాష్ట్రకూట సామ్రాజ్యం అత్యధికంగా విస్త రించింది. 973 లో రాష్ట్రకూట వంశం పతనమయింది.

వాతాపి చాళుక్యుల వారసుడనని చెప్పు కునే రెండవ తైలుడు—ఒక సామంతు—వారి పతనానికి కారకుడయాడు.

ఈ తైలుడు కల్యాణీ చాళుక్య వంశానికి మూల పురుషుడు. ఇతని వారసులు తంజా వూరు చోళులతో యుద్ధాలు చేశారు. ఇప్పుడు చోళుల ప్రతిభ కూడా హెచ్చసాగింది. ఇందుకు కారణ భూతులు రాజరాజ చోళుడూ, అతని కుమారుడు మొదటి రాజేంద్ర చోళుడూనూ. దక్షిణ భారతంలో చోళులూ, చాళుక్యులూ సంఘర్షణ పడు తూంటే ఉత్తర భారతంలో చరిత్రకు కొత్త అధ్యాయం ప్రారంభ మయింది; సుల్తాను ఘజ్నీ మహమ్మదు విజృంభణ ఫలితంగా ఒక్కొక్క ఉత్తర రాజ్యమే పతనం కాసాగింది.





# కుమారసంభవము

చతుర్థాశ్వాసము :

మఱునాడును స్వాహాసతి
మఱియొక మునిపత్నివేష
మలవరించుకొని మెల్లగ
కొలని దరికి అరుదెంచెను.

చీకటిలో తన కన్నులు
చిల్లులుపడునట్లు చూచు
అగ్నికి కనిపించె నామె
అమృతాంశుని కళ పోలిక!

రా రమ్మని చేరదీసి
పేరేమని అడిగె నగ్ని;
'కళ' యంచును బదులు పల్కి
తలను వంచుకొన్న దామె.

ఆ మఱునా 'డనసూయగ,'
అటుపిమ్మట 'హవిర్భువుగ,'
'గతి' పోలిక, 'కృత్తిక'గా
పతినిగూడె స్వాహాసతి.

ఇక వసిష్ఠుని సతి అరుంధతి
ఇతరులకు కనిపింపదాయెను;
అందుచే ఆ సాధ్వి వేషము
అగ్ని భార్యకు కుదురదాయెను.

ఎన్ని చీరలు కట్టి చూచిన
ఏవియును సరిపోవవాయెను;
తాను సద్యో గర్భవతియును
నైన మాటెకు తెలియదాయెను.

బడలికతో నాటిరాత్రి
ప్రాల్మాలుచు స్వాహాసతి
తెల్లుపొదల చెంతకు మెల
మెల్లగ చని మేనువాల్చె.

ఉత్పల సత్యనారాయణాచార్య



కనులు మూసి కొన్నంతట
కలగాంచిన చందంబుగ
అగ్నిసతి కుమారు నొకని
అచ్చోటనె ప్రసవించెను.

ఆ బాలుని చూచి స్వాహ
అమితానందము పొందెను;
పాలిచ్చి పరుండబెట్టి
పాపను ముద్దిడుచుండెను.

అంతలోన పెనుగాడ్పులు
వింతగ వీతెంచి మించె;
అల్లలాడె వనమెల్లను
ఱెల్లుపొదలు మోకఱిల్లె.

నల్లని మేఘమ్ములపుడు
నలు దిక్కుల నావరించె;
ఫెళఫెళమని మిన్ను విఱుగ
పిడుగులు పడి వర్షించెను.

అగ్నిపత్ని తన బిడ్డను
అక్కున నిడుకొని వెఱపున
ఱెల్లుపొదల నొదిగి యొదిగి
రేయిని తలదాచుకొనెను.

తెల్లవాఱు నప్పటికా
కల్లోలం బుపశమించె;
అగ్నిపత్ని తన బిడ్డను
అచట భద్రపఱచి పోయె.

ఇట్టి మహోత్పాతమునకు
హేతువు ఏమై యుండునొ?
అని యక్షులు సభ చేసిరి
అచ్చటి చైత్రరథంబున.

యక్షుడొకడు మునిపత్నుల
వ్యవహారం బెఱిగించెను;
'సరిగా నే జూచితి'నని
మఱియొక్కడు వివరించెను.

మునిపత్నుల వలన కీడు
మూడినదని యక్షులెల్ల
సభలో వసవస వాగిరి,
సభ్యులు గుసగుసలాడిరి.



సరగున ఆ వార్త యెట్లో
సప్తర్షుల చెవిని బడెను;
ఆగ్రహమున ఒక్కొక్కడు
ఉగ్రుండై మండిపడెను.

ఓసీ! నా యింట నీవు
ఉండవలదు పోపొమ్మని
మును లార్వురు తమ భార్యల
ముంగిటి కవ్వల నెట్టిరి.

అన్నెము పున్నెం ఎఱుగము
అని వారలు మొత్తుకొనిన
మునులు నిజం బెఱుగరైరి,
అనుమానము వీడరైరి.

దివ్యదృష్టి యున్ననేమి,
త్రికాలజ్ఞుడైన నేమి,
ఆడుదాని శీలమందు
అనుమానమె పురుషునకును!

ఒక వసిష్ఠముని మాత్రము
ఉజ్జగింపడయ్యె సతిని;
తక్కినవా రాఱుగురును
తమ సతులను విడిచినారు.

మునిపత్నులు దురపిల్లుచు
చనుచుండగ తెల్లుపొదల
చక్కని పసివానిని కని
సంతోషము పొందినారు.

ఆఱుగురా బాలుని తమ
అక్కున గదియించుకొనిరి;
ఆర్మోగములతో నాతడు
అందఱికడ పాలుత్రావె!

అంతలోన స్వాహాసతి
అచటికి వేవేగ వచ్చి,
నా పాపడు తేతెండని
పైపాటున లాగుకొనెను.

ఆ యార్గురు తమ గోడును
అగ్నిసతికి వినిపించిరి;
తమకా పసివాని నిచ్చి
ధన్యుల గావింపు మనిరి.

అది విని స్వాహసతి తన
అపచారమునకు వగచెను;
మునిపత్నుల నూఱడించి
తన పుత్రుని కడ నుంచెను.

వెంటనె ఆ మునుల కడకు
వెళ్లి నిజము వెల్లడించి,
ఎప్పటివలె ఇల్లాండ్రను
ఏలుకొనుండని వేడెను.

ఛీ పొమ్మని మునులార్వురు
చిఱ్ఱు బుస్సులాడినారు;
నీ హిత వక్కఅలేదని
స్వాహను కోపించినారు.

దోషము తనదైయుండగ
దూఱనేల ఇతరుల నని
కిక్కురు మనకుండ నామె
గ్రక్కున వెనుదిరిగి వచ్చె.

అప్పుడు విశ్వామిత్రుడు
అచ్చోటికి విచ్చేయుచు,

తెల్లుపాదల తేజరిల్లు
పిల్లవాని పరికించెను.

ఇతడెవ్వరివాడో యని
ఇంచుక ఆలోచించెను;
ఈశ్వరాంశ సంభవుడని
ఎఱిగి యటకు అరుదెంచెను.

ఆ తాపసి పసివానికి
జాతకర్మ మొనరించెను;
ప్రియమార కుమారుడనెడి
పేరుపెట్టి దీవించెను.

అంతట నా పసిబాలుడు
అమిత బలుండై నిలిచెను!
ప్రళయకాల మహోదగ్ర
భైరవ మూర్తిగ పొలిచెను!

అపుడు విశ్వామిత్రు డాయెడ
అఱిగి యుండిన శివధనుస్సును
ఆ కుమారస్వామి కిచ్చెను,
హర్షమున దీవించి వెళ్లెను.–(సశేషం)



# రాకాసి లోయ

## 17

[కేశవుడూ, అతడి అనుచరులూ నది ఆవలి తీరం చేరగానే, బానిస వ్యాపారం చేసే ఒక స్థూలకాయుడి నౌకర్ల చేత ఎదుర్కోబడ్డారు. కేశవుడూ, జయమల్లూ వాళ్ళకు దొరికి పోయారు. మునలివాడూ, కోయయువకుల జాడలేదు. మరనటి రోజున బానిసలను కొనేందుకు ఇద్దరు వర్తకులు స్థూలకాయుడి గుడారాల దగ్గిరకు వచ్చారు. తరవాత—]

స్థూలకాయుడు వర్తకులకు కేశవుణ్ణి, జయమల్లునూ చూపుతూ, "చూశారా, కారుపోతుల్లా ఎలా వున్నారో! నది కవతల వున్న జలపాతం మీది నుంచి, ఛడేల్‌మని నదిలోకి ఒక్క దూకు దూకి, ఫటేల్ ఛటేల్ మంటూ కొరమీనుల్లా, ఈ దరికి కను మూసి తెరిచేంతలో ఈదుకొచ్చారు. వీళ్ళను, ఎక్కడా ఒళ్ళు కంద కుండా, దెబ్బ తగల కుండా పట్టుకునే ప్రయత్నంలో, నా నౌకర్లు పన్నెండు మంది చచ్చారు. అహాఁ ఏం బలం! ఒక్క పిడికిటి పోటుతో ఒక్కొక్కణ్ణి చంపేశారు......"

స్థూలకాయుడు యిలా మాట్లాడుతు పోతూంటే, వర్తకుల్లో ఒకడు, "చాలయ్యా, ఆగు! ఇంతకీ ఒక్కొక్కడికి ఏ పది బంగారు కాసులో యివ్వమనవు గదా?" అన్నాడు.

"పది బంగారు కాసులా! మీరూ నన్ను ముంచాలనుకుంటున్నారా? గడిచిన







యిరవయ్‌నాలు గ్గంటల నుంచీ వీళ్ళను నా బిడ్డల్లా సాకుతున్నాను. వీళ్ళకు యింత వరకూ పెట్టిన తిండే ముప్ఫై బంగారుకాసుల పైన చేస్తుంది. వాళ్ళదేం తిండి, ఏం బలం! ఒక పలుగు చేతికిచ్చి చూడండి, కొండల్ని నిలువునా పిండిచేసి మరీ చూపెడతారు!" అన్నాడు స్థూలకాయుడు.

వర్తకుల్లో ఒకడు చిరునవ్వు నవ్వుతూ కేశవుణ్ణి సమీపించి, తన చేతికర్రతో అతడి భుజం మీద ఒక్కపోటు పొడిచాడు. కేశవుడికి బాధా, ఎక్కడలేని కోపమూ కలిగింది. కాని, అతడు నిబ్బరంగా వూరుకున్నాడు. వర్తకుడు పెద్దగా నవ్వుతూ, స్థూలకాయుడి



కేసి తిరిగి, "వీళ్ళను గురించి నువ్వు చెప్పిందాంట్లో కొంత నిజం వున్నట్టుంది. ఆ దెబ్బకు మరొకడైతే కిచు మనవలసిందే!" అన్నాడు.

ఈ మాటలకు స్థూలకాయుడు పరమానందం చెందిపోయి, "ఆహాఁ, నే చెప్పలా? ఒక్కొక్కడూ ఒక్క ఏనుగు గున్నను కొండి!" అన్నాడు.

"అంత కర్ర పోటూకూ కుయ్ఁ కయ్ఁ మనలేదు. ఒకవేళ వాడు మూగి వెధవ కాదుగదా?" అంటూ రెండో వర్తకుడు, కేశవుడికి దగ్గిరిగా వెళ్ళి, "ఏరా, నీకు మాట్లాడటం చాతవా? నీ పేరేమిటి?" అని అడిగాడు,

కేశవుడు పొంగి వస్తున్న కోపాన్ని అణుచుకుంటూ, "కనిష్ఠుడు! మనుషుల్ని పశువుల్లా క్రయవిక్రయాలు చేసే మీకు పేర్లతో పనేమిటి?" అన్నాడు.

"ఆహాఁ చూశారా, ఎంత తెలివైన జవాబిచ్చాడో? శాస్త్రపురాణాల్లోకి ఎక్కాలిసిన మాట!" అన్నాడు స్థూలకాయుడు పొంగిపోతూ.

"అఘోరించాడు! ఎన్ని నీతివాక్యాలూ, ధర్మ పన్నాలూ అయితే ఒక బంగారు కాసు చేసేట్టు! సరే, ధర తేల్చు. ఇద్దరికీ





కలిపి ముప్ఫై కాసులిచ్చుకుంటాం, సరా ?" అన్నాడు వర్తకుడు.

"ఇద్దరికీ కలిపి ముప్ఫై కాసులు ! నన్ను నాశనం చేస్తే మీకేం ఒరుగుతుంది ? నేను మునిగి పోతే మీక్కలిగే లాభం ఏమిటి? దేవుడు సాక్షిగా చెపుతున్నాను. వీళ్ళిద్దర్నీ పట్టుకునే ప్రయత్నంలో నా నౌకర్లు పన్నెండు మంది చచ్చారు," అంటూ స్థూలకాయుడు నెత్తీ నోరూ కొట్టుకోసాగాడు.

వర్తకులిద్దరూ కొంచెం దూరంగా వెళ్ళి, కొద్దిసేపు సంప్రతించుకుని తిరిగి బానిస వ్యాపారి దగ్గరకు వస్తూ, "ఆఖరి మాటగా నలభై కాసు లిస్తాం. ఇష్టమైతే అమ్ము లేకపోతే లేదు. మా కవతల చాలా పను లున్నై. ఇంకా ఇరవై మంది బానిసలను కొని, ఆ కొండవాగు పక్కన వుంచి వచ్చాం. త్వరగా ప్రయాణమై పోవాలి," అన్నారు.

"ఇలా వ్యాపారం జరిగితే యిక నేను మట్టి కొట్టుకు పోవలసిందే. దీనికన్న గుడారా లెత్తివేసి, ఏ గుహలోనో ముక్కు మూసుకు కూచుని తపస్సు చేసుకోవటం లాభసాటిగా వుంటుంది," అంటూ స్థూల కాయుడు అటూ యిటూ గెంతసాగాడు.

బానిసల బేరం యీ విధంగా గంట సేపు సాగి, ఆఖరుకు అరవై బంగారు కాసు




లకు తేల్చి వేయబడింది. స్థూలకాయుడు వర్తకుల దగ్గర్నుంచి అరవై కాసులూ తీసు కుని, వాటిని రొండికి బిగించి వున్న పట్టా సంచీలో దాస్తూ, "మళ్ళీ ఎప్పుడు, మీ దర్శనం? ఒక్క నెల రోజు లాగి వచ్చా రంటే, మేలిమి బంగారంలాంటి సరుకు ఒప్ప చెపుతాను," అన్నాడు.

"రాకేం, వస్తాం. మన లావాదేవీలు దీన్తోనే అయిపోయిన వనుకుంటున్నావా? కాని, నీ నుంచి ఒక్క సహాయం కావాలి," అన్నారు వర్తకులు.

"ఏమిటా సహాయం ?" అంటూ స్థూల కాయుడు, అనుమానంగా చూశాడు.



"మరేం లేదు. ఈ మధ్య కొంత కాలంగా మన కపిల రాజ్యమంతా అరాజకంగా వున్నదని నీకు తెలియంది కాదు. కత్తి చేత బట్టగల వాడల్లా, దారి దోపిడి గాడుగా తయారయాడు. మా దగ్గిర చూడబోతే, చాలా విలువైన సరుకుంది—ముప్పై యిద్దరు బానిసలు. రెండు మజిలీల ప్రయాణంలోగాని మేం కపిలపురం చేరలేం. ఈ రాత్రి అడవిలో మజిలీకి నువ్వు కాస్త తోడు రావాలి," అన్నారు వర్తకులు.

స్థూలకాయుడు మంత్రగబ్బ కాటు తిన్నవాడిలా ఎగిరి పడి, "ఒక్క గంట కాలం నా గుడారాలను నౌకర్లకు ఒప్పచెప్పి ఎక్కడికైనా వెళ్ళానే, నా వ్యాపారం గుణ్ణమే. అందరూ దొంగ వెధవలు. నేను చాలా నష్టపడి పోతాను," అన్నాడు.

వర్తకులు చిరునవ్వు నవ్వుకుని, "ఈ రాత్రి మా వెంట వున్నందుకు, నాలుగు బంగారు కాసు లిచ్చుకుంటాం, సరా ?" అన్నారు.

"నాలుగు బంగారు కాసుల్తో నా నష్టం పూడుతుందా? పది...ఎనిమిది...సరే, ఐదు యివ్వండి, యిక బయలుదేరుదాం," అంటూ స్థూలకాయుడు కొరడా ఝుళిపిస్తూ కేశవుడూ, జయమల్లుల కేసి వెళ్ళాడు.

కేశవుడూ, జయమల్లులను వెంట బెట్టుకుని, వర్తకు లిద్దరూ, స్థూలకాయుడూ అరణ్యమార్గాన నడిచి, ఓ గంట తరవాత ఒక కొండవాగు దరికి చేరారు. అక్కడ ముప్పై మంది బానిసలు, నౌకర్ల కాపలాలో గంధపు చెక్క నరుకుతున్నారు. వాళ్ళను చూస్తూనే స్థూలకాయుడు పెద్దగా నవ్వి, "బానిసలను కొనటానికైన ఖర్చు, వాళ్ళు మోసుకొచ్చే మంచి గంధంచెక్క అమ్మితే వస్తుంది. ఇక, వాళ్ళ నమ్మగా వచ్చిన డబ్బంతా లాభమే. ఆహా! ఎంత తెలివైన వాళ్ళయ్యా, మీరు!" అన్నాడు.

వర్తకులు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, తమ నౌకర్లకు ప్రయాణం కావల

సిందని హెచ్చరికలు చేశారు. చూస్తూండ గానే నౌకర్లు, బానిసల చేత నరికిన గంధం చెక్క అంతా కట్టలు కట్టించి, వాళ్ళను ఒక సొలుపుగా నడుపుతూ, దానికి అటూ యిటూ కొరడాలు ఝళిపిస్తూ బయలు దేరారు. అందరికన్నా ముందు స్థూల కాయుడు నడవసాగాడు.

మహా వృక్షాలతో, చిన్నా పెద్ద జలపాతాలతో, ఊబి నేలలతో మహా భయంకరంగా వున్న అరణ్యంలో పడి అందరూ సూర్యాస్తమయం వరకూ నడిచారు. వారికి దారి పొడుగునా సింహ గర్జనలూ, ఏనుగుల ఘీంకారాలూ వినిపించ సాగినై. అలాంటి సమయాల్లో స్థూలకాయుడు అదిరిపడుతూ, "ఐదు కాసుల కోసం, నేనేం ప్రాణగండం తెచ్చుకోలేదు గదా," అనుకోసాగాడు.

సూర్యాస్తమయమైన కొద్ది సేపటికల్లా అరణ్యాన్ని గాఢాంధకారం అలముకొన్నది. బానిసె లందర్నీ సమతలంగా వున్న ఒక చోట మందవేసి, అడవి మృగాలు మీద పడకుండా వుండేందుకు రక్షణగా, వాళ్ళ చేత చుట్టూ ముళ్ళ పొదలు ఎత్తుగా వేయించారు. ఆ రక్షణల మధ్య రెండూ మూడు చోట్ల పెద్ద నెగళ్ళు వెలిగించారు. ఆ తరవాత అందరికీ ఎండు రొట్టెలూ, కాల్చిన మాంసమూ ఆహారంగా పెట్టారు.







రాత్రి గడుస్తున్నకొందికీ ముళ్ళ పొదల కావలి నుంచి సింహాలు చేసే గర్జన అధికం కాసాగింది. కేశవుడూ, జయమల్లూ పక్క పక్కల పడుకుని తమ భవిష్యత్తును గురించి మథన పడసాగారు. కేశవుడికి తన తండ్రి ఏమయిపోయాడన్న దిగులు అధికం కాసాగింది.

"మల్లూ, మా అయ్యా క్షేమంగా వుండి వుంటాడంటావా ?" అని అడిగాడు కేశవుడు.

"అతడి కొచ్చిన ప్రమాదం ఏమీ లేదు. ఈ అరణ్యంలోనే ఎక్కడో కోయ యువకు లిద్దరితో దాక్కొనివుంటాడని నా నమ్మకం," అన్నాడు జయమల్లు.

కేశవుడికి జయమల్లు మాటల్లో విశ్వాసం కలగలేదు. అతడు మరేదో ప్రశ్నించ బోయేంతలో హఠాత్తుగా సింహ గర్జనలు ఆగిపోయినై. కేశవుడు ఉలిక్కిపడి లేచి కూచుంటూ, "మల్లూ, అంతా నిశ్శబ్దం అయింది. ఏదో ప్రమాదం..." అనేంతలో, భీకరంగా గర్జిస్తూ ఒక సింహం ముళ్ల పొదల మీది నుంచి కుప్పించి లోపలికి దూకింది. నిద్రపోతున్న బానిసలంతా ఒక్క సారి లేచి, హాహాకారాలు చేశారు. స్థూల కాయుడూ, వర్తకు లిద్దరూ క్షీచుమనే గొంతులతో, "బాణాలు...కత్తులు... ఈటెలు...చంపండి, సింహాన్ని చంపండి!" అని తమ నౌకర్లను హెచ్చరిస్తూ ఒక పక్కకు పారిపోయారు.

నౌకర్లు సింహం మీదికి రివ్వురివ్వు మంటూ బాణాలు వదిలారు. కాని, ఒక్కటీ దాన్ని తాకలేదు. ఈ లోపల సింహం గొలుసులతో బంధించబడి వున్న బానిసల గుంపు మీద పడి, యిద్దరు ముగ్గుర్ని తన పంజా దెబ్బలతో గాయపరిచింది.

కేశవుడూ, జయమల్లూ ఒకే జట్టుగా నెగళ్ళ దగ్గిరకు పరిగెత్తి, మండుతున్న రెండు కట్టెపుల్లలను తీసుకుని, "బాణాలు వేసి సింహాన్ని మరింతగా రెచ్చకొట్టకండి.



దాన్ని మేం బయటికి తరిమేస్తాం!" అంటూ సింహం కేసి పరిగెత్తారు.

మండుతూన్న కట్టెపుల్లలను చూస్తూనే, సింహం ఓ తృటికాలం తటపటాయించి, అంతలోనే పెద్దగా కోరలు చాచి, ముందున్న కేశవుడి మీదికి లంఘించింది. కేశవుడు దాని పంజా దెబ్బను తప్పుకుంటూ, తన చేతులో వున్న మండే కట్టెను దాని మీదికి విసిరాడు. మంట తన శరీరాన్ని తాకగానే సింహం ఒక్కసారి పెద్దగా గర్జించి వెనక్కు తిరిగింది. అదే సమయంలో జయమల్లు తన చేతులో వున్న కట్టెను దాని వెన్నుకు తగిలేలా కొట్టాడు.

సింహం మెరుపులా ముళ్ళపొదల్ని మించి లంఘించి అరణ్యంలోకి పారిపోయింది. స్థూలకాయుడూ, వర్తకు లిద్దరూ కేశవుడూ జయమల్లుల దగ్గిరకు వచ్చారు. స్థూలకాయుడు నిలువెల్లా వణికి పోతున్నాడు. వర్తకుల మాట చెప్పనవసరమే లేదు.

"మీ యిద్దరూ, మమ్మల్ని ఎంతో ధన నష్టాన్నుంచి కాపాడారు. ఇద్దరు బానిసలు చచ్చారు, ఒకడు గాయపడ్డాడు. అదేమంత పెద్ద నష్టం కాదు. మీరు చూపిన ధైర్యానికీ, చేసిన సహాయానికీ, ఈ నాటి నుంచీ మీకు తిన్నంత ఆహారం పెట్ట దలిచాం," అన్నాడొక వర్తకుడు.

"ఓ అలాగే చేద్దాం. కపిల నగరంలో వీళ్ళిద్దరినీ అమ్మేటప్పుడు, ఈ జరిగిన సంగతి గుర్తుంచుకుని, కొంచెం మంచి ధర రాబట్టాలి. ఒక వేళ నేను మరిచిపోతే, నువ్వు కాస్త గుర్తు చెయ్యి," అన్నాడు రెండో వర్తకుడు, తన తోటివాడితో.

"అందరూ కలిసి నన్ను ముంచారు! వీళ్ళింత అసహాయ శూరులని తెలిస్తే, అరవై కాసులకు అమ్మేవాడినా? నేను గుణ్ణమయి పోయాను...దివాళా ఎత్తిపోయాను..." అంటూ స్థూలకాయుడు కుప్పిగంతులు వేయసాగాడు. —(ఇంకా వుంది)






# మహావీరుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు పడే ఈ శ్రమ అంతా మరొకరి కోసం లాగుంది. అవతలివాడు ఎంతో సత్పాత్రుడైతే తప్ప పరోపకారం చేయరాదు. అలా చేసినందు వల్ల అపాయమే కలుగుతుంది గాని, ప్రయోజనం ఏమీ ఉండదు. ఇందుకు తార్కాణంగా నీకు మహావీరుడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం గౌడదేశంలో మహావీరుడనే క్షత్రియ యువకుడుండే వాడు. అతని బల శౌర్యపరాక్రమాలు సాటిలేనివి. అందుకే అతను బాలుడుగా ఉండగానే అనేకమంది రాక్షసులను సంహరించాడు. అతని వద్ద అదృశ్యఘుటిక ఒకటి ఉండేది. దానిని తలపై ఉంచుకుంటే అతను అదృశ్యంగా

---

బేతాళ కథలు



ఉండేవాడు. ఆ ఘటికను అతనికి యక్షులు ప్రసాదించారు. అతని కీర్తి అంగ వంగ కళింగ దేశాలూ, బ్రహ్మదేశమూ దాటి నలు మూలలా విస్తరించింది.

యుక్తవయసు రాగానే మహావీరుడు పెళ్ళాడ నిశ్చయించాడు. పాటలీపుత్ర రాజైన చిత్రగుప్తుడికి సులోచన అనే చెల్లెలున్నది. ఆమె సాటిలేని సౌందర్యవతి అని విని మహావీరుడు ఆమెను పెళ్ళాడ నిశ్చయించుకుని పాటలీపుత్రానికి బయలుదేరి వెళ్ళాడు. అతని కీర్తి ప్రతిష్ఠలను గురించి అదివరకే విని ఉండటం చేత చిత్రగుప్తుడు మహావీరుడికి రాజోచితమైన ఆతిథ్యం ఇచ్చి, ఇష్టం వచ్చినంత కాలం తమ రాజధానిలో ఉండమన్నాడు. మహావీరుడు సంతోషంగా ఇందుకు ఒప్పుకున్నాడు. ఏమంటే సులోచన అతను అనుకున్నదానికంటెకూడా గొప్ప సౌందర్యవతి. ఆమెను చూసిన మీదట ఆమెనే పెళ్ళాడాలన్న నిశ్చయం అతనిలో మరింత బలపడింది.

మహావీరుడు పాటలీపుత్ర నగరంలో ఒక ఏడాది ఉన్నాడు. చిత్రగుప్తుడికీ అతనికీ మంచి స్నేహంకూడా ఏర్పడింది. అయినా మహావీరుడు తన మనసులోని కోరిక చిత్రగుప్తుడికి చెప్పలేదు. ఒకనాడు చిత్రగుప్తుడే తన మనసు విప్పి మహావీరుడికి తన రహస్యం ఈ విధంగా చెప్పుకున్నాడు:

"బ్రహ్మపురాన్ని యశోవతి అనే రాణి పాలిస్తున్నది. ఆమె కింకా వివాహం కాలేదు. ఆమె ఒప్పుకున్నట్టయితే పెళ్ళాడడానికి ఎందరో రాజకుమారులు సిద్ధంగా ఉన్నారు. కాని ఆమె తనకన్న బలహీనుణ్ణి పెళ్ళాడనని భీష్మించుకుని కూచున్నది. తనను పెళ్ళాడ వచ్చినవాణ్ణి తనతో సమంగా బాణం వెయ్యమంటుంది, తనతో గదా యుద్ధం చెయ్యమంటుంది. ఓడిపోతే శిరశ్ఛేదం చేయిస్తుంది. ఎందరో బలశాలులు ఆమెతో పోటీ చేసి ఓడిపోయి, ప్రాణాలు పోగొట్టు

కున్నారు. ఆమెను తప్ప మరొకతెను పెళ్ళాడటం నా కిష్టంలేదు. కాని ఆమెతో పోటీ చేశానో, తప్పక ఓడిపోతాను. నా కన్న బలవంతులనే ఆమె ఓడించి, తలలు తీయించింది. ఈ సమస్య ఎలా పరిష్కార మవుతుందో నాకు తెలియటంలేదు."

చిత్రగుప్తుడు ఈ మాట చెప్పగానే మహా వీరుడు, "మిత్రమా, నీవు యశోవతిని పోటీలో ఓడించటానికి అవసరమైన సహాయం నేను చెయ్యగలను. కాని అందు కొక నిబంధన ఉన్నది. అదేమిటంటే, నీ చెల్లెలు సులోచనను నా కిచ్చి పెళ్ళి చెయ్యాలి," అన్నాడు.

"నా చెల్లెలిని నీవు పెళ్ళాడదలిస్తే నా అభ్యంతరమేమీ లేదు. కాని యశోవతితో నేను బహిరంగంగా పోటీ చేసేటప్పుడు నీవు ఎలా సహాయపడగలవు? అది అసంభవం," అన్నాడు చిత్రగుప్తుడు.

"నా వద్ద అదృశ్యఘుటిక ఉన్నది. దాని సహాయంతో నేను నీ వెంటనే ఉండి, నా బలం నీకు అరువియ్యగలను," అన్నాడు మహావీరుడు.

ఈ మాట వినగానే చిత్రగుప్తుడికి యశోవతి తన భార్య అవుతుందన్న ఆశ పుట్టుకొచ్చింది. అతను మహావీరుడితో



ముందు జరగవలసిన కార్యక్రమం గురించి ఆలోచించాడు.

"నీవు నీ సామంతులతో సహా బ్రహ్మ పురానికి బయలుదేరు. నేనుకూడా నీ వెంట వస్తాను. నేనుకూడా నీ సామంతునే అని చెప్పు. అప్పుడు ఎవరికీ ఎలాటి అను మానమూ కలగదు. యశోవతిని జయించ టానికి నీవు ఒక సామంతుడి సహాయం అర్థిస్తావని ఎవరూ తలచరు," అన్నాడు మహావీరుడు.

ఆ ప్రకారమే చిత్రగుప్తుడు కొద్దిమంది సామంతులనూ, మహావీరుణ్ణీ వెంట బెట్టు కుని బ్రహ్మపురం వెళ్ళి, రాణి యశోవతికి

తాను వచ్చిన పని తెలియబరిచాడు. యశోవతి చిత్రగుప్తుడికి పోటీ నియమాలు తెలిపి, మర్నాడు అతనితో పోటీ చెయ్యటానికి ఏర్పాటు చేసింది.

మర్నాడు చిత్రగుప్తుడు తన అనుచరులతో సహా పోటీ జరిగేచోటికి వెళ్ళాడు. అక్కడికి రాణి యశోవతికూడా తన ఆయుధాలతో సహా వచ్చింది. పోటీ ఆరంభంకాక పూర్వమే మహావీరుడు తనకు ఒంట్లో బాగాలేదని వంకపెట్టి బసకు బయలుదేరాడు. దారిలో ఒక నిర్జన ప్రదేశంలో అతను అదృశ్యఘుటిక ధరించి, ఎవరికీ కనబడకుండా పోటీ జరిగే చోటికి వచ్చి, చిత్రగుప్తుడి భుజం తట్టి "సంకోచించకు, నీకు గెలుపు తప్పదు," అని రహస్యంగా చెప్పాడు.

యశోవతి వద్ద ఒక దృఢమైన విల్లున్నది. ఆమెను పెళ్ళాడేవాడు ఆ వింటికి బాణం సంధించి, బలం కొద్దీ లాగి విడవాలి. యశోవతి విడిచిన బాణం కన్న పోటీదారు విడిచే బాణం ఎక్కువ దూరం వెళ్ళితేనే ఆమె ఓడినట్టు.

యశోవతి ఎక్కుపెట్టని విల్లునూ, బాణాన్నీ చిత్రగుప్తుడి కిచ్చి, "మీరు ఈ వింటితో ఈ బాణాన్ని ఎంత దూరం వేస్తారో వెయ్యండి," అని చిత్రగుప్తుణ్ణి అడిగింది.



చిత్రగుప్తుడు ఆ వింటికి తాడు తగిలించటానికి కూడా ఇబ్బందిపడి ఉండేవాడే, కాని అదృశ్యంగా ఉన్న మహావీరుడు వింటిని వంచటానికి సహాయపడితే, అతను సులువుగా తాడు తగిలించాడు. తరవాత బాణం ఎక్కుపెట్టి లాగేటప్పుడుకూడా చిత్రగుప్తుడితో బాటు మహావీరుడుకూడా లాగాడు. వారిద్దరూ కలిసి లాగి విడిచిన బాణం చాలా దూరాన వెళ్ళిపడింది. యశోవతి వేసిన బాణం అంతదూరం వెళ్ళలేకపోయింది. యశోవతికి ఆగ్రహమూ, ఆశ్చర్యమూకూడా కలిగాయి. తరవాత ఇద్దరూ గదా యుద్ధానికి ఉపక్రమించారు. ఇందులోకూడా మహావీరుడి అదృశ్యహస్తం చిత్రగుప్తుడి చేతిలోని గదను పట్టుకున్నది. క్షణం లోపలనే చిత్రంగా యశోవతి చేతిలోని గద ఎగిరిపోయి అంత దూరాన పడింది. యశోవతి పూర్తిగా ఓడిపోయింది.

అందరూ కలిసి రాజభవనానికి వెళ్ళారు. మహావీరుడు తిన్నగా అక్కడికి వెళ్ళి, ఏమీ ఎరగని వాడిలాగా, యశోవతిని, "పోటీ పూర్తి అయిందా? ఎవరు గెలిచారు?" అని అడిగాడు.

"మీ రాజుగారే గెలిచారు. అన్న మాట ప్రకారం నేనాయనను పెళ్ళాడబోతున్నాను," అన్నది యశోవతి.





సులోచన మటుకు మహావీరుణ్ణి మొదటి సారి చూసినప్పటి నుంచీ కూడా తన ప్రాణం కంటె అధికంగా ప్రేమించింది. అతను అపూర్వ బలసంపన్నుడే గాక, స్నేహ పాత్రుడూ, ఇతరులకు సహాయపడే స్వభావం కలవాడుకూడా. అటువంటివాడు తనకు భర్త అయాడని సులోచన తనలో తాను చాలా గర్వపడేది. తన భార్యకు తనపై గల ప్రేమాభిమానాలు గమనించి మహావీరుడు ఆమెతో తాను యశోవతిని ఓడించటానికి ఎలా సహాయం చేసిందీ చెప్పేశాడు. ఆ వృత్తాంతం విని సులోచన మరింత గర్వపడింది.

ఈ గర్వమే మహావీరుడి ప్రాణాలకు యమపాశంగా పరిణమించింది. ఎందుకంటే, కొద్దిరోజుల అనంతరం యశోవతీ, సులోచనా కబుర్లాడుకుంటూ తమ భర్తలను గురించి మాట్లాడు కోవటంలో యశోవతి, "నా భర్తను మించిన బలాఢ్యుడు ప్రపంచంలో మరొ కడు లేడు," అన్నది.

"నీ భర్త నా భర్తకు చాలడు," అన్నది సులోచన.

"సామంతును తెచ్చి చక్రవర్తితో పోలుస్తా వేమిటి? నన్ను పెళ్ళాడతామని వచ్చి ఎందరో బలాఢ్యులు నా చేత ఓడి

బ్రహ్మపురంలోనే యశోవతికీ, చిత్ర గుప్తుడికీ వివాహమయింది. చిత్రగుప్తుడు మగధ దేశానికీ, బ్రహ్మదేశానికి కూడా రాజయాడు. పెళ్ళి అయిన తరవాత అతను భార్యతో సహ పాటలీపుత్రానికి తిరిగి వచ్చి మహావీరుడికి తన చెల్లెలు సులోచన నిచ్చి వైభవంగా పెళ్ళి చేశాడు.

ఈ పెళ్ళి జరుగుతుందని తెలియగానే యశోవతి తన భర్తతో, "చక్రవర్తి చెల్లెలిని ఒక సామంతు కిచ్చి పెళ్ళి చేయుటమా?" అని ఆశ్చర్యం కనబరిచింది.

చిత్రగుప్తుడు నవ్వి, "అతను నాకు అప్తమిత్రుడు కూడా," అన్నాడు.

పోయారు. మీ అన్న ఒక్కడే నన్ను ఓడించి పెళ్ళాడగలిగాడు," అన్నది యశోవతి కోపంగా.

సులోచనకు పౌరుషం వచ్చింది. "నా భర్త మా అన్నకు సామంతు అని ఎవరు చెప్పారు? అది అబద్ధం. అదీగాక మా అన్న తన బలంతో నిన్ను గెలిచాడను కుంటున్నావు కాబోలు. అది వట్టి మాట. నా భర్త అదృశ్యంగా ఉండి సహాయం చెయ్యబట్టే నీవు ఓడిపోయావు. నా భర్త వద్ద అపూర్వమైన అదృశ్యఘుటిక ఉన్నది," అంటూ ఆమె, తన భర్త తనకు తెలిపిన రహస్యమంతా తన వదినెగారికి చెప్పేసింది.

యశోవతి గుండెలో కార్చిచ్చురగిలించి నట్టయింది. కఠోరమైన నియమాలు పెట్టి ఎంతో బలశాలిని తాను భర్తగా పొందానను కుంటే తన ఆడబిడ్డ అంతకంటె బలశాలిని ఏ నియమాలూ లేకుండా సంపాదించటం ఆమె సహించలేకపోయింది. అందుచేత మహావీరుడి నిర్మూలనానికి ఎత్తు వేసింది.

ఆమె తన భర్తతో, "మీ సామంతయిన మహావీరుడి ప్రవర్తన ఏమీ బాగాలేదు. తక్కువవాళ్ళకు చనువివ్వరాదు. అందులో చెల్లెలిని కూడా ఇచ్చి మీరు తేలిక అయి పోయినారు. అతను అందరితోనూ ప్రగల్భా



లాడుతున్నాడట; నన్ను పోటీలో జయించింది మీరు కాదనీ, తానేననీ, నేను న్యాయంగా తనకే భార్య అయి ఉండ వలిసిందనీ అంటున్నాడట. ఇలాటి మాటలు మీరుగాని, నేనుగాని ఎలా సహించగలం?" అని ఒకటికి పదిసార్లు గుచ్చిగుచ్చి అన్నది.

చిత్రగుప్తుడు తన భార్య మాటలు నమ్మాడు. మహావీరుడి పై అతని కుండిన కృతజ్ఞతాభావం ద్వేషంగా మారింది. అతను తన సామంతులతో సంప్రతించి మహావీరుణ్ణి రహస్యంగా చంపించేశాడు. స్నేహపూర్వకంగా ఉపకారం చేసినందుకు మహావీరుడు తన ప్రాణాలే కోల్పోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మహావీరుడికి జరిగిన ద్రోహానికి కారకులెవరు? తొందరపడి తన భర్త రహస్యాన్ని బయపెట్టిన సులోచనా? తన భర్త కంటె మహావీరుడు బలవంతుడని తెలిసి ఓర్చలేక పోయిన యశోవతా? భార్య మాటలు నమ్మి మిత్రద్రోహానికి కూడా తలపడిన చిత్రగుప్తుడా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సులోచన తన భర్త గొప్ప తనాన్ని దాచి ఉంచటం అస్వాభావికం. భర్తను ప్రేమించిన ఏ భార్య కూడా తన భర్తను ఇతరులు తక్కువ చేసి మాట్లాడుతూ ఉంటే చూస్తూ ఊరుకోలేదు. కనుక ఆమె తన భర్త రహస్యం వెల్లడించింది. అందుచేత ఆమె నిర్దోషి. యశోవతి కూడా నిర్దోషి అనే చెప్పాలి. ఎందుకంటే ఆమె సులోచన చెప్పిన రహస్యాన్ని నమ్మనైనా నమ్మాలి, లేదా మహావీరుడు తన భార్యతో అబద్ధం చెప్పాడని అయినా అనుకోవాలి. తన భర్త తనను పంచించాడను కోవటం ఇష్టంలేక ఆమె మహావీరుడు అబద్ధం ప్రచారం చేశాడనే నిర్ణయానికి పచ్చింది. ఇక చిత్రగుప్తుడు తన భార్యకు నిజం చెప్పి ఆమె ఆగ్రహానికి పాత్రుడైనా కావాలి, లేదా, మహావీరుణ్ణి తుదముట్టించి ఆమెకు తృప్తి అయినా కలిగించాలి. అన్యాయంగా సాధించుకున్న భార్యను అతను న్యాయం కోసం త్యాగం చెయ్యటం అస్వాభావికమే. అసలు దోషి మహావీరుడే. అతను తన రహస్యాన్ని తన భార్యకు చెప్పి ఉండరాదు. అలా చెప్పటంవల్ల అతను సాధించినది ఏమీలేదు—ప్రాణాలు పోగొట్టుకోవటం తప్ప," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# చెప్పిచ్చిన విద్య

పిల్లలందరూ పండగ తలంట్లు పోసుకుని, కొత్త బట్టలు కట్టుకుని తాతయ్యే కోసం ఎదురు చూస్తున్నారు. ఆ రోజు తాతయ్య కూడా తలంటుకుని స్నానం చేశాడు. అయితే ఆయన వచ్చేలోపునే సూరి "చందమామ" తెచ్చాడు. దాని కోసం పిల్లలందరూ ఘోరంగా పోట్లాడుకుంటూండగా తాతయ్య వచ్చి, "ఓహో, మీకు కావలిసిన కథలు దొరికినట్టున్నాయే! నే నలా బయటికి వెళ్ళి వస్తా," అన్నాడు.

"వొద్దు తాతయ్యా, కథ చెప్పి మరీ వెళ్ళు," అని పిల్లలు కేకలుపెట్టారు. వాళ్లు తనని వదలరని రూఢి చేసుకున్నాక తాతయ్య వచ్చి తన కుర్చీలో కూచున్నాడు. పిల్లలందరూ చుట్టూ మూగారు.

"తాతయ్యా, నాకూడా కథలు ర్రాయటం నేర్పుతావా? రాసి చందమామకి పంపిస్తాను," అన్నాడు బాబు.

తాతయ్య బోసినోటితో నవ్వి, "ఇటువంటివి నేర్పితే వస్తాయా? ఎవరంతట వాళ్ళు నేరవాలిసిందే. చెప్పిచ్చిన విద్యా, కట్టిచ్చిన మూటా ఎంతోదూరం రావన్న సామెత మీరు వినలేదూ?" అంటూ రొండి నుంచి పొడుం కాయ పైకి తీశాడు.

"బాబిగాడికి అక్షరాలు కూడా సరిగా రావు, చందమామకి కథ రాస్తాట్ట—కథ! వాడితో ఏమిటిగాని, నువు మాకు మంచి కథ చెప్పు, తాతయ్యా," అన్నాడు సూరి.

"కట్టిచ్చిన మూటేమిటి, తాతయ్యా?" అన్నాడు బుల్లాడు.

"పూర్వం రైళ్ళూ, బస్సులూ లేవు గదరా! ప్రయాణమై పోయేవాళ్ళు అన్నం మూటగట్టుకు వెళ్ళేవాళ్ళు. అది ఒకపూట వచ్చేను, రెండుపూటలు వచ్చేను. దూర ప్రయాణం మీద వెళ్ళేవాడికి ఆ భోజనం ఎంతదూరం వస్తుంది?" అన్నాడు తాతయ్య.







"కథ! కథ, తాతయ్యా," అని పిల్లలు కేకలు పెట్టారు. తాతయ్య పొడుం పీల్చి చెయ్యి దులుపుకుని ప్రారంభించాడు:

ఒక ఊళ్ళో ఒక అబ్బాయి ఉండేవాడు—మన బాబులాటివాడే! వాడికి గొప్ప గొప్ప విషయాలన్నీ తెలుసుకుని జ్ఞాని అయిపోవాలని ఉండేది—మన బాబుగాడికి కథలు రాసెయ్యాలని ఉన్నట్టే!

ఇంతలో ఏమయిందీ, వాళ్ళ ఊరికి ఒక సాధువు వచ్చాడు. అది తెలిసి ఆ అబ్బాయి ఆ సాధువు వద్దకు వెళ్ళి, "స్వామీ, నాకు జ్ఞానం ఉపదేశించండి. మీ ఉపదేశంతో నేను జ్ఞానినై పోతాను," అన్నాడు.

సాధువు నవ్వి, "పిచ్చివాడా! చెప్పిచ్చిన విద్యా, కట్టిచ్చిన మూటా ఎంతో దూరం రావన్న సామెత వినలేదా? నోటిమాటల జ్ఞానం తెలియుని వాళ్ళెవరుంటారు? అంత మాత్రానికి అందరూ జ్ఞానులై పోతున్నారా?" అన్నాడు.

"స్వామీ, మీరు చెప్పేది నాకు సరిగా బుర్రకెక్కటం లేదు," అన్నాడు అబ్బాయి.

"నే నీ ప్రాంతాల రెండు రోజులుంటాను. కావాలంటే ఈ రెండు రోజులూ నా వెంట తిరుగు. అప్పుడు నే చెప్పినది నీకు బోధపడే అవకాశం దొరికితే దొరకవచ్చు," అన్నాడు సాధువు.

జ్ఞాని కావాలనుకున్న కుర్రాడూ, సాధువూ ఆ రోజల్లా కలిసి తిరిగి, ఆ రాత్రికి ఎవరి ఇంటి అరుగుల మీదనో పడుకున్నారు.

అది ఒక దొంగవాడి ఇల్లు. ఆ రాత్రి దొంగవాడు దొంగ తనానికి బయలుదేరబోతూ ఉంటే అతని కొడుకు, "నాన్నా, నాకు కూడా దొంగతనం చేసే విద్య చెప్పమంటే చెప్పవు. నాక్కూడా దొంగ కావాలని ఉంది," అన్నాడు.

"ఒరే, చెప్పిచ్చిన విద్యా, కట్టిచ్చిన మూటా ఎంతదూరం వస్తాయిరా? దొంగవు కావాలంటే నీ బుద్ధి వినియోగించి, అను



భవం ద్వారా విద్య నేర్చుకోవాలిసిందే!" అన్నాడు తండ్రి.

"సరే అయితే అనుభవం ద్వారానే నేర్చుకుని నేను దొంగ నవుతాను. నన్ను కూడా ఈ రాత్రి నీ వెంట రానీ!" అన్నాడు దొంగ కొడుకు. తండ్రి సరేనన్నాడు. ఇద్దరూ కలిసి బయలుదేరారు.

ఇదంతా అరుగు మీది నుంచి వింటున్న కుర్రవాడు సాధువుతో, "స్వామీ, ఈ దొంగ కూడా మీరన్నమాటే అంటున్నాడు. వీళ్ళు ఏం చేస్తారో చూసి వస్తాను," అని చెప్పి, తండ్రి కొడుకుల వెనకగా తానుకూడా బయలుదేరాడు.

దొంగవాడు తన కొడుకును వెంట బెట్టుకుని ఒక ధనికుడి ఇంటికి వెళ్ళాడు. గోడలో కన్నం తవ్వాడు. తన కొడుకుతో, "లోపలికి వెళ్ళు. మధ్య గదిలో భోషాణం ఉన్నది. అందులో నగలూ, నాణ్యాలూ ఉన్నాయి. ఈ మారు తాళపు చెవితో ఆ భోషాణం తెరిచి, నీకు వీలయినంత బంగారు సరుకు పట్టుకురా!" అన్నాడు.

తండ్రి ఇచ్చిన తాళపు చెవి తీసుకుని కొడుకు లోపలికి వెళ్ళాడు. భోషాణం తలుపు తెరిచి, లోపల ప్రవేశించి, పైన తలుపు మూశాడు. తలుపు మూసేటప్పుడు కిర్రుమని చప్పుడయింది. ఆ చప్పుడుకు ఒకరిద్దరు నిద్రాభంగం చెంది, "ఏమిటది?" అన్నారు. వారిలో ఒకడు నిద్ర మత్తున లేచి వెళ్ళి, భోషాణం మీద పడుకుంటూ, "నిద్రపొండి, తెల్లారి చూసుకుందాంలే!" అన్నాడు. దొంగ కొడుకు భోషాణంలో చిక్కుకుపోయాడు.

ఈ సంగతి బయట ఉన్న దొంగకు తెలియగానే వాడు ఇంటి దారి పట్టాడు. దొంగల వెంట బయలుదేరిన కుర్రాడు కూడా, దొంగ ప్రవర్తనకు ఆశ్చర్యపోతూ, వాడి వెనకనే వచ్చేశాడు. దొంగ తన ఇంట్లో ప్రవేశించి తలుపు వేసుకుని నిశ్చింతగా

నిద్రపోయాడు. కొడుకు ఎలా తప్పించుకుంటాడా అన్న బెంగ వాడికి కొంచెంకూడా లేనట్టు కనిపించింది.

ఈ లోపుగా, భోషాణంలో చిక్కిన దొంగ కొడుకు ఏం చేశాడూ, నిశ్చింతగా తనకు పట్టుకోవటానికి సాధ్యమైనంత బంగారం సరుకు తీసి మూట కట్టుకున్నాడు. ఈ పని పూర్తి కాగానే ఎలుకలాగా చప్పుడు చేశాడు. ఆ చప్పుడు విని భోషాణం మీద పడుకున్న వాడు, "ఎలుక! ఎలుక!" అంటూ భోషాణం మూత ఎత్తాడు. వెంటనే, లోపల ఉన్న కుర్రవాడు చెంగున బయటికి దూకి, భోషాణం మీద పడుకుని లేచిన మనిషిని గట్టిగా ఒక్క తన్ను తన్ని, తన తండ్రి చేసిన కన్నంలో నుంచి బయటపడి, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తసాగాడు.

ఈ లోపల ఇంటిల్లి పాతీ లేచారు. "దొంగ! దొంగ!" అని కేకలు పెడుతూ వాడి వెంట పడ్డారు.

వాళ్ళను వదిలించుకోవటానికి ఆ దొంగ కొడుకు ఏం చేశాడూ? తన దారిలో కనిపించిన ఒక బావిలో పెద్ద బండరాయి దభాల్న పడేసి, సమీపంలో ఉన్న చెట్టెక్కి కూచున్నాడు.

చీకట్లో ఈ చప్పుడు విని, దొంగను తరిమే వారంతా బావి వద్దకు చేరారు.



కొందరు దీపం తెచ్చారు. కొందరు సాహసులు బావిలోకి దిగారు. కాని దొంగ జాడ లేదు. ఈ తంతు చాలాసేపు జరగటంచేత, దొంగవాడు తప్పించుకుని ఈ సరికి ఇల్లు చేరి ఉంటాడనుకుని, దొంగను పట్టుకునే యత్నం మానేసి వాళ్ళంతా తిరిగి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

తరవాత దొంగ కొడుకు తాపీగా చెట్టు దిగి ఇంటికి వచ్చి, తలుపు తట్టి తండ్రిని లేపి, జరిగినదంతా చెప్పాడు.

అదంతా అరుగు మీద ఉన్న సాధువూ, కుర్రవాడూ విన్నారు. సాధువు కుర్రవాడితో, "చూశావా, నాయనా? ఆఖరుకు దొంగ విద్య అయినా సరే అనుభవంతోనే నేర్చుకోవాలి. చెప్పిచ్చిన విద్య ఎందుకూ పనికి రాదు!" అన్నాడు.

తాతయ్య ఈ కథ చెప్పగానే బాబు, "అలా అయితే నా అంతట నేనే కథలు రాసి పంపేస్తాను. కథలు రాయటం నా కెవరూ చెప్పక్కర్లేదు," అన్నాడు.

ఈ మాటకు అందరూ నవ్వారు. బాబుకు కోపం వచ్చింది.

తాతయ్య నవ్వుతూ, "ఒరే, బాబిగాడా? వెనకటికి నీ వంటివాడే చదవ నేరుస్తావా, రాయ నేరుస్తావా అంటే చదవానేరను, రాయానేరను, చింప నేరుస్తా నన్నాట్ట!



నీ ధోరణి చూస్తూవుంటే జగన్నాథం కొడుకు వెంకటప్పగాడు గుర్తు కొస్తున్నాడ్రా!" అన్నాడు.

"వెంకటప్ప ఎవరు, తాతయ్యా?... వాడేం జేశాడు, తాతయ్యా?...చెప్పు, తాతయ్యా!" అని పిల్లలు గొడవ చేశారు.

"అరవకండర్రా, చెబుతానూ!" అంటూ తాతయ్య చెప్పసాగాడు:

కోటపాలెంలో జగన్నాథమని ఉండే వాడు. చాలా గొప్ప ధనికుడు. ఊరికి పెద్ద కూడానూ. ఆ రోజుల్లో గ్రామ పెద్దంటే ఎంతో గౌరవం ఉండేది. ఊళ్ళో ఏ తగాదా వచ్చినా గ్రామ పెద్దకు చెప్పకుని, అయన చెప్పినట్టు తగాదా పరిష్కారం చేసుకునే వారు. ఎవరికి ఏ సహాయం కావాలన్నా గ్రామ పెద్ద చేసేవాడు. ఎవరికి ఏ కష్టం వచ్చినా గ్రామపెద్ద వచ్చి చేతనైతే ఆదుకునే వాడు, చేతగాకపోతే పరామర్శించి వెళ్లేవాడు.

జగన్నాథం కొడుకు వెంకటప్ప. తండ్రిని అందరూ ఎంతో గొప్పగా చూడటం గమనించి తానుకూడా తండ్రి అంతవాడు కావాలని వాడికి ఉండేది. అందుచేత వాడు తండ్రి వెంట తిరుగుతూ, తండ్రి ఎవరితో ఎలా మాట్లాడతాడో శ్రద్ధగా గమనించేవాడు.

ఒకనాడు ఊళ్ళో ఒక ఇంటి యజమానికీ, ఆయన అల్లుడికీ తగాదా వచ్చింది.



అల్లుడు మామగారిని పట్టుకుని నానా మాటలూ అన్నాడు.

ఈ సంగతి గ్రామపెద్ద అయిన జగన్నాథానికి తెలిసింది. తగాదా పరిష్కరించటానికి పోతూ ఆయన కొడుకును వెంటబెట్టుకు వెళ్ళాడు. ఆయన ఇంటివారి అల్లుడితో చెప్పవలిసిన మాటలు చెప్పి, "మీ మామగారు చాలా గొప్పవాడు. అందుచేత తన గొప్పతనం పైకి చెప్పుకోడు. అతన్ని నేను యాభై ఏళ్ళుగా ఎరుగుదును," అన్నాడు. అంత పెద్దవాడు చెప్పినాక అల్లుడు పశ్చాత్తాప పడి మామగారిని క్షమాపణ కోరుకున్నాడు.

వెంకటప్ప తన తండ్రి మాట్లాడే ధోరణి బహు జాగ్రత్తగా గమనించి పట్టుకున్నాడు. ఒకనాడు వాడు వీధిన వెళుతుండగా విశ్వనాథంగారనే ఆయన ఇంటి దగ్గిరికి వచ్చేసరికి కోలాహలంగా ఉన్నది. జరిగిందేమంటే ఆ ఇంట దొంగతనం జరిగింది. వారి పనిమనిషిని సందేహించి పట్టుకుని గుంజకు కట్టి పెట్టారు. వాడి భార్య లబోమని ఏడుస్తూ తన మొగుడేమీ చెయ్యలేదంటున్నది.

వెంకటప్ప లోపలికి వెళ్ళి ఈ సంగతి అంతా గ్రహించి, "వీణ్ణి నేను యాభై ఏళ్ళనుంచీ ఎరుగుదును. మంచి దొంగ.



ఈ చుట్టుపక్కల ఇటువంటి దొంగ లేడు. వాణ్ణేమీ అనకండి!" అన్నాడు.

వెంకటప్ప మాటలు వెర్రి మాటలని ఎవరూ అనుకోలేదు. "వాడే దొంగతనం చేశాడన్న సంగతి ఎంత చమత్కారంగా చెప్పాడో చూశారా?...జగన్నాధంగారి కొడుకు కాదూ?" అని అతణ్ణి అందరూ మెచ్చుకున్నారు.

మరోనాడు వెంకటప్ప రచ్చ బండ దగ్గిరికి వచ్చేసరికి అక్కడ ఒక కోడెదూడ అమ్మకం జరుగుతున్నది. జనం పోగై ధర మాట్లాడు తున్నారు. కొందరు దాని లక్షణాలు కనిపెడుతున్నారు.

వెంకటప్ప అక్కడ ఉన్న ఒక కుర్ర వాణ్ణి, "ఇక్కడ ఎందుకు ఇంతమంది జనం పోగయారు? ఏమిటీ సంగతి?" అని అడిగాడు.

"ఆవు దూడను అమ్ముతున్నారు," అని ఆ కుర్రాడు చెప్పాడు.

వెంటనే వెంకటప్ప జనం మధ్యకు వెళ్లి కోడెదూడను చూశాడు. అక్కడున్న వారిలో ఒకడు, "నూరు రూపాయ లడుగుతున్నారు, బాబూ, తమరు చూసి చెప్పండి—అంత ఖరీదు చేస్తుందేమో!" అన్నాడు.

వెంకటప్ప దూడ మీద చెయ్యి వేసి నిమిరి, "ఓ, భేషైన ఆవు! ఈ చుట్టు పక్కల అంతా దీని పాలే తాగుతారు. నేను యాభై ఏళ్ళ నుంచీ ఎరుగుదును. నూరు రూపాయ లేమిటి? ఎంత ఇచ్చినా ఇవ్వ వచ్చు," అన్నాడు.

వెంటనే వెంకటప్ప పట్టి బడుద్దాయి అని అందరికీ తెలిసిపోయింది. ఆ నాటి నుంచీ వాడికి వెంకటప్ప అనే పేరుపోయి వెంగళప్ప అనే పేరు వచ్చింది.

తాతయ్య కథ పూర్తి చేశాడో లేదో భోజనాలకు రమ్మని పిలుపు వచ్చింది. "అప్పచ్చులు!" అని కేకలు పెడుతూ పిల్లలంతా లేచిపోయారు.






# సర్పయాగం

ధౌమ్యుడనే ఋషి వద్ద ముగ్గురు శిష్యులుండేవారు. వారి భక్తి శ్రద్ధలు పరీక్షించటానికి గురువుగారు ఆ శిష్యులను నానా హింసలూ పెట్టేవాడు.

నిర్దయుడైన ధౌమ్యుడి వద్ద శిష్యుడుగా వెట్టి చాకిరి చేసి వేదు డనేవాడు చదువు పూర్తి చేసి, వివాహమాడి, ఆశ్రమం ఏర్పాటు చేసుకుని శిష్యులను చేర్చుకున్నాడు. అయితే అతను గురువు ఆశ్రమంలో అష్టకష్టాలూ పడ్డాడేమో, తన శిష్యులకు ఒక్క పనీ చెప్పక ఎంతో చక్కగా చూస్తూ వేద శాస్త్రాలు నేర్పుతూ వచ్చాడు.

వేదుడి శిష్యులలో ఉదంకుడనే వాడొకడుండేవాడు. ఇతను చదువు పూర్తి చేసి, పెళ్ళి చేసుకోవటానికి గురువుగారి అనుమతి పొందినవాడై, "అయ్యా, నాకు గురు దక్షిణ ఇవ్వాలని ఉంది. ఏమి ఇయ్యమంటారు?" అని అడిగాడు.

"నాకు తెలియదు. నా భార్య ఏం కావాలంటుందో అడుగు," అన్నాడు వేదుడు.

గురుపత్ని ఉదంకుడితో, "మరి నాలుగు రోజులకు నేను పుణ్యకవ్రతం చేద్దామనుకుంటున్నాను. పౌష్యుడనే రాజు భార్య వద్ద కుండలాలున్నాయి. వాటిని తెచ్చి ఇచ్చావో, అవి ధరించి వ్రతం చేసుకుంటాను," అన్నది.

అలాగేనని ఉదంకుడు పౌష్యుడి వద్దకు బయలుదేరి వెళ్ళి ఆయనతో తాను వచ్చిన పని చెప్పాడు.

రాజు అతనితో, "నా భార్య అంతఃపురంలో ఉంటుంది. ఆమె నడిగి కుండలాలు తీసుకుపోవచ్చు," అన్నాడు.

ఉదంకుడు పౌష్యుడి భార్య వద్దకు వెళ్ళి తన గురుదక్షిణ సంగతి చెప్పి, గురుపత్ని కోసం కుండలా లడిగాడు. ఆమె సంతోషంతో కుండలా లతనికిస్తూ, "అయ్యా, ఈ కుండలాల మీద తక్షకుడు కన్నువేసి ఉంచాడు.








వాటిని అతడి పాలపడకుండా ఎలా కాపాడు కుంటావో!" అని హెచ్చరించింది.

కుండలాలు పుచ్చుకుని ఉదంకుడు పౌష్యుడి వద్దకు వచ్చి, "రాజా, నేను వచ్చిన పని అయింది. వెళ్లివస్తాను," అన్నాడు.

"నీ వంటి అతిథి రాకరాక వచ్చి భోజనం కూడా చెయ్యకుండా వెళ్ళటమా? నా ఆతిథ్యం స్వీకరించాలి," అన్నాడు పౌష్యుడు. ఉదంకుడు సమ్మతించి భోజనానికి కూచున్నాడు. అన్నంలో వెంట్రుక వచ్చింది. తనకు అశుచిగా భోజనం పెట్టించాడని ఆగ్రహించి ఉదంకుడు పౌష్యుణ్ణి గుడ్డి వాడవుకమ్మని శపించాడు. ఈ బ్రాహ్మడు నన్ను అకారణంగా శపిస్తాడా అని రాజు ఎదురు శాపం పెట్టి, "నీకు సంతులేక పోవు గాక!" అన్నాడు.

అకారణంగా ఇద్దరూ తొందర పడ్డారు. అన్నంలో వెంట్రుక వచ్చినంత మాత్రాన ఉదంకుడు రాజును శపించ నవసరంలేదు. ఉదంకుడు వెంట్రుక చూపుతున్నప్పటికీ గమనించక ప్రతి శాపం ఇవ్వటం రాజుదీ పొరబాటే. ఇద్దరూ పశ్చాత్తాపపడ్డారు. ఉదంకుడు తన శాపాన్ని ఉపసంహరించాడు గాని, అలా తన శాపాన్ని ఉపసంహరించే శక్తి పౌష్యుడికి లేకపోయింది.

ఉదంకుడు రాజు చేత శాపం పొంది, కుండలాలు పుచ్చుకుని అరణ్య మార్గాన గురువుగారి ఆశ్రమానికి వస్తూండగా ఒక చెరువు వచ్చింది. ఆచమనం చేద్దామనే ఉద్దేశంతో ఉదంకుడు కుండలాలను చెరువు గట్టున ఒకచోట పెట్టి నీటి వద్దకు వెళ్ళాడు. అతనలా వెళ్ళగానే తక్షకుడు వాటిని కాస్తా సంగ్రహించేశాడు.

ఈ తక్షకుడు దిగంబర మానవ రూపంలో, కాస్సేపు కనిపిస్తూ, కాస్సేపు కనిపించకుండా, ఉదంకుడి వెంట వస్తూనే వచ్చాడు. తక్షకుడు కుండలాలు తీసుకున్న మరుక్షణమే ఉదంకుడు పరిగెత్తుకుంటూ



వచ్చి, పారి పోతున్న తక్షకుణ్ణి పట్టుకున్నాడు. కాని తక్షకుడు అంతలోనే పాముగా మారి, అక్కడ ఉన్న ఒక బిలంలో దూరి నాగలోకంలో తన ఇల్లు చేరుకున్నాడు.

ఉదంకుడు పట్టుదలతో ఆ బిలాన్ని తవ్వుకుంటూ పాతాళంలో ఉండే నాగలోకానికి వెళ్ళాడు. అక్కడ కనిపించిన నాగు లందరికీ దణ్ణాలు పెట్టాడు. అయితే ఒక్కరూ అతనికి కుండలాలు తిరిగి ఇప్పించలేదు.

అతను చుట్టూ కలయచూశాడు. అతనికి కొన్ని వింతలు కనిపించాయి. ఒకచోట ఇద్దరు స్త్రీలు తెల్ల పోగులతోనూ, నల్ల పోగులతోనూ ఒక బట్ట నేస్తున్నారు. మరొక చోట అరుగురు పిల్లవాళ్ళు పన్నెండాకులు గల చక్రాన్ని తిప్పుతున్నారు. మరొక చోట ఒక గొప్పజాతి గుర్రం నిలబడి ఉన్నది. దాని మీద ఒక పురుషుడున్నాడు.

ఉదంకుడు ఆ పురుషుణ్ణి సమీపించి, ఆయనను స్తోత్రం చేశాడు. ఆ మనిషి సంతోషించి, "ఏంకావాలో కోరుకో!" అన్నాడు.

"అయ్యా, నాకీ నాగలోకమంతా వశం కావాలి," అన్నాడు ఉదంకుడు. ఆ మనిషి సరేనన్నాడు. ఉదంకుడు చూస్తూండగానే ఆ మనిషి ఎక్కిన గుర్రం నుంచి పొగలూ, మంటలూ బయలుదేరాయి. నాగలోక



మంతటా పొగ చుట్టు వేసుకుంది. తక్షకుడు భయపడి కుండలాలను తెచ్చి ఉదంకుడికి ఇచ్చేశాడు.

ఉదంకుడు కుండలాలు సంపాదించాడే గాని వ్రతం గడువులోపుగా వాటిని గురుపత్నికి ఎలా అందజేయాలో తెలియక దీనుడైపోయాడు. గుర్రం మీది మనిషి అతని దైన్యం గమనించి, కారణం తెలుసుకుని, "ఈ గుర్రం ఎక్కు. గడువు దాటకుండా గురువుగారింటికి చేరుతావు," అన్నాడు. ఉదంకుడా గుర్రా నెక్కి గురువుగారింటికి వెళ్ళి, తరుణం మించి పోకుండానే గురుపత్నికి కుండలా లిచ్చాడు.

తరవాత ఉదంకుడు తన గురువుగారితో జరిగినదంతా చెప్పి తాను నాగ లోకంలో చూసిన దృశ్యాలకు అర్థం అడిగాడు.

"నీవు పాతాళంలో చూసిన స్త్రీలు ధాతా, విధాతా. వారు నేసే బట్టలో తెల్లని పోగులు పగళ్ళు, నల్లనివి రాత్రులు. నీకు కనిపించిన ఆరుగురు కుర్రవాళ్ళూ ఆరు ఋతువులు. వారు తిప్పే చక్రం సంవత్సరం. దానికి గల పన్నెండాకులూ, పన్నెండు మాసాలు. నీకు గుర్రం మీద మనిషి కనిపించాడే, ఆ మనిషి పర్జన్యుడు. ఆయన ఎక్కిన గుర్రం అగ్నిదేవుడు," అన్నాడు వేదుడు.

ఉదంకుడు గురువు దగ్గిర సెలవు పుచ్చుకుని బయలుదేరాడు. అతనికి తక్షకుణ్ణి తలుచుకున్నప్పుడల్లా మండి పోతున్నది. అందుచేత అతను తిన్నగా హస్తినాపురానికి వెళ్ళి, అక్కడ రాజుగా ఉన్న జనమేజయుణ్ణి చూసి, ఆశీర్వదించి, "రాజా, ఏమిటిది? నీ ముఖ్య ధర్మాన్ని నిర్వర్తించకుండా ఇలా ఎంతకాలం తాత్సారం చేద్దామనుకున్నావు?" అని మందలించాడు.

జనమేజయుడు ఆశ్చర్యపడి, "మునీశ్వరా, నేను రాజ్యపాలనలో గాని, క్షత్రియ ధర్మంలో గాని ఏ లోపమూ రాకుండా పరిపాలన సాగిస్తున్నానే! అయినా నా వల్ల



జరగవలసిన దేదన్నా ఉంటే అనతి ఇయ్యండి," అన్నాడు.

ఉదంకుడు జనమేజయుడికి తన కథ అంతా చెప్పి, "నేను గురుపత్నికి కుండలాలు తెచ్చేటప్పుడు పాపిష్ఠి తక్షకుడు నన్నిన్నిపాట్లు పెట్టాడు. అసలు మీ తండ్రిని కాటు వేసి చంపింది ఈ తక్షకుడు కాడా? కశ్యపుడనే బ్రాహ్మణుడు అమోఘమైన తన ఔషధంతో మీ తండ్రికి సర్ప విష ప్రమాదం లేకుండా చేద్దామని వస్తుంటే, అతన్ని దారిలో అడ్డగించి, అంతులేని ధనం లంచం పెట్టి పంపివేసినవాడు తక్షకుడు కాదా? ఆ తక్షకుణ్ణీ, నాగకులాన్నీ భస్మం చెయ్యటానికి వెంటనే సర్ప యజ్ఞం అరంభించు," అన్నాడు.

జనమేజయుడికి తన తండ్రి మరణ వృత్తాంతం తెలియదు. ఆయన మంత్రులతో, "ఇదంతా ఎలా జరిగింది?" అని అడిగాడు. వారు అతనికి జరిగిన వృత్తాంతమంతా చెప్పారు.

అర్జునుడి కొడుకైన అభిమన్యుడు భారత యుద్ధంలో మరణించిన నాటికి అతని భార్య అయిన ఉత్తర గర్భవతిగా ఉన్నది. అశ్వత్థామ అపాండవం చేస్తానని బ్రహ్మశిరో నామాస్త్రం వేసినప్పుడు కృష్ణుడి దయవల్ల




ఉత్తర గర్భానికి ప్రమాదం తప్పింది. ఆమె పరీక్షితును కన్నది. అతడు కృపుడి వద్ద విద్య నేర్చి పెద్దవాడై రాజ్యానికి వచ్చి, అందరికీ తృప్తికరంగా రాజ్యం చేస్తూ వచ్చాడు.

పరీక్షితుడికి వేట అంటే చాలా ఇష్టంగా ఉండేది. ఒకనాడాయన చాలా మృగాలను వేటాడి, తన చేత దెబ్బతిని పారిపోయిన మృగాన్ని వెతుక్కుంటూ అరణ్యంలో శమీకుడనే ఋషి తపస్సు చేసుకుంటున్న చోటికి వచ్చి, "మునీశ్వరా, నా చేత దెబ్బ తిన్న మృగం ఇటుగా పరిగెత్తుకుంటూ వచ్చింది. అది ఏ దిక్కుగా వెళ్ళిందో తెలిస్తే చెప్పండి," అని అడిగాడు.





శమీకుడు మౌనవ్రతం వహించి ఉండటం చేత పరీక్షితుడికి సమాధానం చెప్పలేదు. పరీక్షితుడికి కోపం వచ్చి, ఆ సమీపంలో పడి ఉన్న పాము కళేబరాన్ని వింటి మొనతో ఎత్తి ఆ ముని మెడలో వేసి, హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు. అయితే పరీక్షితుడికి తాను చేసిన పని తప్పని తెలిసి పశ్చాత్తాపం కలిగింది; ఎందుకంటే, చచ్చిన పామును మెడలో వేసినప్పటికీ ఆ ముని అతనిపై ఆగ్రహించలేదు, చలించలేదు.

శమీక మహామునికి శృంగి అనే ఒక కొడుకున్నాడు. అతను గురువుగారి ఇంటి నుంచి తండ్రి ఆశ్రమానికి వస్తుంటే దారిలో కృశుడనే స్నేహితుడు కనిపించాడు. "మా తండ్రి క్షేమంగా ఉన్నాడా?" అని శృంగి అతణ్ణి అడిగాడు.

"పరీక్షితుడు మీ నాయన మెడలో చచ్చిన పామును వేసి వెళ్ళిపోయాడుగా!" అంటూ కృశుడు హాస్యం చేశాడు.

శృంగి ముక్కోపి. అతను శాపోదకం పట్టి, "నా తండ్రిని అవమానించిన పరీక్షితుడు వారం లోపల తక్షకుడి విషంతో చస్తాడుగాక!" అని శపించాడు.

తరవాత శృంగి తండ్రి వద్దకు వెళ్ళాడు. చచ్చిన పాము ఇంకా ఆయన మెడలో వేళ్ళాడుతూనే ఉంది. అదికూడా తెలియక శమీకుడు యోగ సమాధిలో ఉన్నాడు. శృంగి ఆ పాము కళేబరాన్ని తీసి పారేసి తండ్రికి నమస్కరించాడు. వెంటనే శమీకుడు కళ్ళు తెరిచి శృంగిని చూశాడు. అప్పుడు శృంగి జరిగినదంతా తండ్రికి చెప్పి, తాను పరీక్షితును శపించిన మాటకూడా చెప్పేశాడు. శమీకుడీ మాట విని అదిరిపడి, నొచ్చుకుని, "నాయనా, ఎందుకు తొందర పడ్డావురా? ధర్మంగా ఏలే రాజుకు కీడు చేయవచ్చునా? రాజంటూ ఉండబట్టేగదా మనమైనా నిశ్చింతగా ఉంటున్నాం, మన తపస్సు నిర్విఘ్నంగా సాగుతున్నది! అందు





లోసూ పరీక్షితుడు ధర్మరాజులాటివాడు. చిన్నతనం చేత ఈ పని చేశావు. చేతనయితే నీ శాపం ఉపసంహరించుకో," అన్నాడు.

ఆ పని తనకు సాధ్యం కాదన్నాడు శృంగి. అప్పుడు శమీకుడు తన శిష్యులలో గౌరముఖు డనేవాణ్ణి పిలిచి, "నీవు పరీక్షితుడి వద్దకు వెళ్ళి కుశల ప్రశ్నలు చేసి, సావధానంగా శాపం గురించి తెలిపి, తక్షకుడి బారిపడకుండా తప్పించుకునే ఉపాయాలుంటే చూసుకోమను. ఈ మాట చెప్పి వచ్చెయ్యి," అన్నాడు. గౌరముఖుడు అన్ని విషయాలూ పరీక్షితుడికి సవినయంగా చెప్పి తిరిగి వచ్చేశాడు.

తరవాత పరీక్షితుడి మంత్రులందరూ ఆలోచించి ఒక ఒంటి స్తంభపు మేడ నిర్మించారు. అందులో గాలికూడా సరిగా చొరటానికి వీలు లేకుండా చేశారు. దాని నిండా విషాలకు విరుగుళ్ళు పేర్చారు. విష వైద్యులనూ, మంత్ర వేత్తలనూ ఆ మేడలో ఉంచారు. రాజూ, మంత్రులూ అందులోనే ఉండి రాజ్యాంగ మంతా నడిపించారు.

ఆరు రోజులు క్షేమంగా గడిచాయి. శృంగి శాపం పెట్టినది మొదలు తక్షకుడిలో పరీక్షితును ఎలా చంపటమా అన్న ప్రేరణ కలిగింది. పరీక్షితుడికి పాము కాటు వల్ల ప్రమాదం ఉందని విని కశ్యపు డనే బ్రాహ్మణుడు రాజును పాము విషం నుంచి కాపాడటానికి హస్తినాపురానికి బయలుదేరి వస్తున్నాడు. ఈ సంగతి తక్షకుడికి తెలియ వచ్చింది. అతను బ్రాహ్మణ రూపంలో కశ్యపుణ్ణి దారిలో కలుసుకుని, "ఎవరు మీరు? ఎక్కడికి ప్రయాణం?" అని రక రకాల ప్రశ్నలు వేశాడు.

దానికి కశ్యపుడు జవాబుగా, "నాకు పాము విషం చేత చచ్చిన వారినీ, మాడి మసిబొగ్గయిన వారినీ కూడా బతికించే మంత్రం తెలుసును. పరీక్షిన్మహారాజును తక్షకుడు కరిచి చంపుతాడట. నే నాయనను

తిరిగి బతికించి ధర్మాన్ని రక్షించటమేగాక, కీర్తికి కీర్తి, డబ్బుకు డబ్బూకూడా సంపాదించుకుంటాను," అన్నాడు.

అప్పుడు తక్షకుడు కశ్యపుడితో, "అయ్యా, నేనే తక్షకుణ్ణి. పిడుగు పడి చచ్చిన వారైనా బతికి రావచ్చునేమోగాని నేను కరచిన వారు మందులతోనూ, మంత్రాలతోనూ తిరిగి బతకటం కలలో వార్త. అందుచేత నీవు వచ్చిన దారి పట్టవచ్చు. నా మాటలలో నీకు నమ్మకం లేదంటావా? ఈ మహా వట వృక్షం చూడు! ఈ మర్రి చెట్టు ఎంతో విశాలంగానూ, ఎత్తుగానూ పెరిగి, ఆకుల తోనూ, కాయలతోనూ నిండి ఉన్నది. దీన్ని నేను కాటు వేస్తే ఏమవుతుందో చూడు," అంటూ ఆ మర్రిచెట్టు మొదలును కాటు వేశాడు. మరుక్షణమే అంత చెట్టుకూడా బూడిద కుప్పగా రాలిపోయింది.

అప్పుడు కశ్యపుడు ఆ బూడిద అంతా ఒక చోట పోగు వేసి తన మంత్రం చదివాడు. వెంటనే ఆ మర్రిచెట్టు ఎప్పటి లాగా అయి నవనవలాడింది.

కశ్యపుడి మంత్ర శక్తికి తక్షకుడు నిర్ఘాంత పోతూ, "అయ్యా, నా విషానికైతే మంత్రం వేశారు గాని అమోఘమైన ముని శాపాన్ని మంత్రం నివారించగలదా? పరీక్షితుడు మీ కిచ్చే డబ్బు కన్న నేను చాలా హెచ్చు





ఇస్తాను. తీసుకుని మీ దారిన మీరు వెళ్ళండి," అన్నాడు.

కశ్యపుడు కూడా కొంచెం యోచించి పరీక్షితుడికి కాలం తీరిపోయిందని నిశ్చయించుకున్నవాడై, తక్షకుడి వద్ద అంతులేని డబ్బు పుచ్చుకుని, వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

ఈ సంఘటన ప్రపంచానికి తెలియకనే పోను. ఏమంటే; తక్షకుడూ, కశ్యపుడూ మాట్లాడుకున్నది నిర్జనమైన అరణ్యంలో. అయితే దైవికంగా ఒక బ్రాహ్మణుడు కట్టెల కోసం అడివికి వెళ్ళి, ఆ సమయాన ఆ మర్రిచెట్టు పైన ఉండి, తక్షక కశ్యపుల



సంభాషణ విన్నాడు; తక్షకుడు కాటు వేసినప్పుడు మర్రిచెట్టుతో సహా బూడిద అయాడు; కశ్యపుడు మంత్రం చదవగానే చెట్టుతో బాటు తిరిగి బతికాడు; తరవాత ఈ సంఘటన అందరికీ చెప్పేశాడు.

కశ్యపుడు డబ్బు తీసుకుని వెళ్ళిపోయాక తక్షకుడు పరీక్షితుణ్ణి చేరి కాటు వేయటానికి తగిన ఉపాయం ఆలోచించాడు. అతను కామరూపులైన నాగులను పిలిచి, "మీరందరూ మునికుమారుల వేషాలు వేసుకుని పరీక్షితు డుండే మేడ దగ్గిరికి పళ్ళూ, పూలూ పట్టుకుని వెళ్ళండి. నేనుకూడా అదృశ్యంగా మీ వెంట ఉంటాను," అని చెప్పాడు.

నాగులు అలాగే వెళ్ళి భవనంలో ఉన్న వారందరికీ పుష్ప ఫలాలు అందజేశారు. పరీక్షితుడు చాలా సంతోషించి, వారి కందరికీ బహుమానా లిప్పించి, వారు తెచ్చిన ఫలాలను తన చుట్టూ ఉన్నవారందరికీ తలా ఒకటి ఇచ్చి, తాను కూడా ఒక పండు తీసుకుని, దాన్ని పగలదీశాడు. అప్పుడాయనకా పండులో నల్లని కళ్ళూ, ఎర్రని శరీరమూ గల చిన్న పురుగు కనిపించింది.

పరీక్షితుడు ఆ పురుగును అందరికీ చూపి, "నా శాపానికి గడువు సూర్యాస్తమయంతో తీరిపోతుంది. ఈ పురుగు నన్ను





స్తంభం మేడ నిలువునా భగభగా మండి పోయింది. చనిపోయిన పరీక్షితుడికి ఉత్తర క్రియలు జరిగాయి.

పరీక్షితుడు పోయేనాటికి అతని కొడుకు జనమేజయుడు బాలుడు. కాని మంత్రులు అతనికే రాజ్యాభిషేకం చేసి పరిపాలన సాగించారు. తరవాత, కాశీరాజు కూతురు వపుష్ట అనే కన్యను తెచ్చి జనమేజయుడి కిచ్చి పెళ్ళి చేశారు. జనమేజయుడి కీర్తి క్రమంగా దశ దిశలా వ్యాపించింది.

జనమేజయుడికి మంత్రులు ఈ విషయా లన్నీ చెప్పి, "మహారాజా, తక్షకుడు మీ తండ్రిగారికి చేసిన ద్రోహం గురించి బాగా ఆలోచించి ఈ ఉదంక మహామునికి తృప్తి కలిగేలాగ చెయ్యండి. తక్షకుడు దుర్మా ర్గుడు కనకనే ఒక బ్రాహ్మణుడు శాపం పెట్టిన మాత్రాన మీ తండ్రిగారి ప్రాణాలు తీశాడు," అన్నారు.

జనమేజయుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన మంత్రులతో, "ఆ శాపం తక్షకుడి కొక సాకుగా దొరికింది. అతడి కోరిక మా తండ్రికి అపకారం చెయ్యాలనే. అందుకే గదా మహా మంత్రవేత్త అయిన కశ్యపుణ్ణి దారిలో అడ్డగించి, లంచం పెట్టి, తిప్పి పంపేశాడు? నేను తప్పక యాగం

కరిచినట్టయితే బ్రాహ్మణుడి శాపం తీరి నట్టూ అవుతుంది, నాకు ప్రాణభయమూ ఉండదు," అంటూ ఆ పురుగును తన మెడ మీద ఉంచుకున్నాడు. అక్కడ ఉన్న వారిలో ఒక్కడుకూడా ఆయనను నివారించ డానికి యత్నించలేక పోయాడు.

అంతలోనే పురుగు గభాల్న తక్షకుడుగా మారిపోయి, తన శరీరంతో రాజును చుట్టి వేసి, "నేనే తక్షకుణ్ణి," అని గట్టిగా అరిచి పరీక్షితుణ్ణి కాటు వేసి వెళ్ళిపోయింది.

తక్షకుణ్ణి చూస్తూనే రాజు పరివారం యావత్తూ పిడుగు పడినట్టుగా చెల్లాచెదరై పారిపోయారు. తక్షకుడి విషాగ్నికి ఒంటి



చేసి తక్షకుడు మొదలైన సర్పా లన్నిటినీ యాగాగ్నిలో బూడిద చేస్తాను. అందువల్ల ఉదంక మహామునికి కూడా తృప్తి కలుగుతుంది," అన్నాడు.

తరవాత జనమేజయుడు రాజ పురోహితుణ్ణీ, యజ్ఞం చేయించే వాళ్ళనూ పిలిపించి, "ఈ సర్పయాగం తంతు ఏమిటి ?" అని అడిగాడు.

దానికి వారు, "మహారాజా, ఈ సర్ప యాగ మన్నది తమ కోసమే ఏర్పడింది. అది చేసే అర్హత తమరి కొక్కరికే ఉన్నది. దీన్ని మరెవరూ చెయ్యారు," అన్నారు.

"అయితే యజ్ఞానికి కావలిసిన ఏర్పాట్లన్నీ చెయ్యండి," అని జనమేజయుడు ఆజ్ఞాపించాడు. సంభారాలన్నీ సేకరిస్తున్నారు. యజ్ఞం చేయించే బ్రాహ్మణులు యజ్ఞశాల నిర్మిస్తున్నారు.

జనమేజయుడి వద్ద లోహితాక్షుడనే ఒక సూతకులం వాడున్నాడు. అతను గొప్ప శిల్ప శాస్త్రవేత్త, వాస్తు నిపుణుడు, అనేక పురాణాలెరిగిన వాడు. అతడు జనమేజయుడితో, "ఈ యాగం పూర్తికాదు. దీని కొక బ్రాహ్మణుడు అడ్డు పడతాడు," అని చెప్పాడు.

అది వినగానే జనమేజయుడు మండిపడి, లోహితాక్షుణ్ణి యాగశాలలోకి రానివ్వ



వద్దని ఉత్తరు విచ్చాడు. తరవాత జనమేజయుడూ, వపుష్టమహాదేవీ యజ్ఞదీక్ష బూని, యాగశాలలో ప్రవేశించారు.

సర్పయాగం ఆరంభమయింది. చండ భార్గవుడూ, పింగళుడూ, కౌత్సుడూ, వ్యాసుడూ, వైశంపాయనుడూ, జైమినీ, ఉద్దాలకుడు మొదలుగాగల అనేక మంది మహామునులు యజ్ఞశాలలో ఉన్నారు. నీల వస్త్రాలు ధరించిన ఋత్విజులు ఒక్కొక్క మంత్రమే చదువుతూంటే ఒక్కొక్క సర్పం వచ్చి అగ్నిలో పడ నారంభించింది.

సర్పాలలో చాలా వంశాలకు చెందిన వారున్నారు; వాసుకీయులూ, తక్షక వంశానికి





వాసుకి తన చెల్లెలయిన జరత్కారువు పద్దకు వెళ్ళాడు.

అలా అతను వెళ్ళటాని కొక కారణం ఉన్నది. సర్పాలన్నీ యాగంలో నశించేలాగు శపించినది సర్పాలకు తల్లి అయిన కద్రువ. ఆవిడ తన సవతి అయిన వినతతో లేనిపోని పందెం వేసి, తాను పందెం గెలప గలందు లకు తన కొడుకులను అన్యాయం చెయ్యా మన్నది. వారు నిరాకరించారు. అందుకని ఆమె వారిని శపించింది.

ఆ సమయంలో ఆమె ఒడిలో ఏలా పుత్రు డనే వాడున్నాడు. బ్రహ్మదేవుడికీ దేవతలకూ ఈ సర్పయాగం గురించి జరిగిన సంభాషణ అంతా వాడు విన్నాడు. దేవతలతో బ్రహ్మ ఏమన్నాడంటే, "సర్ప యాగం జరుగుతుందిగాని, అది పూర్తి అయే లోపుగా జరత్కారువుకు పుట్టిన కుమారుడు దాన్ని మధ్యలో నిలిపి వేస్తాడు," అన్నాడు. ఈ మాట ఏలాపుత్రుడు విని వాసుకికి చెప్పాడు. అది మొదలు వాసుకి తన చెల్లెలైన జరత్కారువు పెళ్ళి కోసం ఎదురుచూడసాగాడు.

ఇలా ఉండగా జరత్కారుడనే ఒక బ్రాహ్మణుడు బ్రహ్మచర్య వ్రతం అవలం బించి తపస్సు చేసుకుంటూ, ఒకనాడు ఒక

చెందినవారూ, ఐరావతులూ, కౌరవ్యులూ, ధృతరాష్ట్ర కులానికి చెందినవారూ వేల, లక్షల సంఖ్యలో పేరు పేరునా పిలవబడి, హోమగుండానికి బలి కాసాగారు. యజ్ఞశాల క్రమంగా భీభత్స పూరితమైంది.

తక్షకుడు భయపడి ఇంద్రుడి వద్దకు వెళ్ళి శరణు వేడాడు. "ఈ సర్పయాగంలో నీలాటి గొప్ప పాములకు ప్రమాదం ఉండ దని అదివరకే బ్రహ్మ చెప్పాడు. అందు చేత నీవు భయపడకు," అని ఇంద్రుడు తక్షకుణ్ణి తన వద్దనే ఉంచుకున్నాడు.

వాసుకి కూడా గొప్ప సర్పాలలో ఒకడు. సర్పయాగం నిలిపించే ప్రయత్నంలో





చెట్టు నంటుకుని తలకిందుగా వేళ్ళాడుతున్న బ్రాహ్మణులను చూసి, "అయ్యా, మీరంతా ఎవరు?" అని అడిగాడు.

దానికి వారు, "మేము జరత్కారుడి పూర్వీకులం. జరత్కారుడు బ్రహ్మచర్యం అవలంబించి సంతానహీనుడు కాపటం చేత ఉత్తమ లోకాలు చేరలేక ఇలా ఉన్నాం," అన్నారు. ఈ మాటలు విని జరత్కారుడు చాలా చింతించి, తన పేరే గల కన్య దొరికితే వివాహమాడ నిశ్చయించి అలాటి కన్య కోసం వెతుకుతూ వాసుకి చెల్లెలిని గురించి విని వచ్చి ఆమెను పెళ్ళాడాడు. వారిద్దరికీ ఆస్తీకుడనే కుమారుడు కలిగాడు.

ఈ ఆస్తీకుడే సర్పయాగం ఆపగలవాడు గనక వాసుకి ఇప్పుడు తన చెల్లెలిని ఆశ్రయించాడు.

జరత్కారువు చిన్నవాడైన తన కొడుకును ఆస్తీకుణ్ణి పిలిచి, "నాయనా, నీవు తపస్సంపన్నుడవు. నీ మామలైన సర్పాలు జనమేజయుడు చేసే యాగానికి బలి అవుతున్నారు. ఈ వంశక్షయాన్ని నీవు నిలుపుతావనే వారు నన్ను మీ తండ్రి కిచ్చి వివాహం చేశారు. కనుక నీవు వెంటనే జనమేజయుడి యజ్ఞశాలకు వెళ్ళి ఈ సర్ప మారణహోమం నిలుపు చేయించు. ఇది నీ వల్లనే సాధ్యమవుతుందని బ్రహ్మదేవుడు అన్నాడట," అన్నది.

ఆస్తీకుడు తల్లి అజ్ఞ పొంది జనమేజయుడి యజ్ఞశాలకు వెళ్ళాడు. జనమేజయుణ్ణీ, అక్కడ చేరిన మహర్షులనూ ప్రశంసించాడు. జనమేజయుణ్ణి ఆశీర్వదించాడు. వయసులో చిన్నవాడు, చక్కని రూపమూ, తేజస్సూ, మధురమైన వాక్కూ గల ఆస్తీకుణ్ణి చూసి అక్కడి వారందరూ ఎంతో ముచ్చట పడ్డారు. జనమేజయుడా యువకుడితో, "అయ్యా, నీ రాకతో యజ్ఞశాలకు ఎంతో కళ వచ్చింది. నీ కేమి వరం కావాలో కోరుకో," అని ఋత్విజుల కేసి

తిరిగి, "ఇన్ని పాములు హోమమయాయి గాని అసలువాడు తక్షకుడింకా బలి కాలేదేం?" అని అడిగాడు.

"రాజా, తక్షకుడు ఈ లోకాలలో ఎక్కడా లేడు. దేవేంద్రుడి చెంతచేరాడు," అని వారు జవాబిచ్చారు.

"అయితే ఇంద్రుణ్ణి కూడా తక్షకుడితో సహా మంత్ర శక్తితో లాక్కురండి," అన్నాడు జనమేజయుడు. వారలాగే మంత్రం చదివే సరికి ఇంద్రుడూ, అతని ఉత్తరీయానికి చుట్టుకుని తక్షకుడూ హోమగుండం కేసి రాసాగారు. అప్పు డింద్రుడు తక్షకుణ్ణి తన బట్ట నుంచి విదిల్చి, వదిలించుకుని, తాను మాత్రం తప్పుకుని వెళ్ళిపోయాడు. తక్షకుడు మెలికలు తిరుగుతూ అగ్ని కేసి పడసాగాడు.

"మహారాజా, నేను కోరినది ఇస్తానన్నారు. ఈ సర్పయాగం వెంటనే మానాలి. అదే నా కోరిక. ఈ సర్పాలు నాకు తల్లి వైపు బంధువులు," అంటూ అస్తీకుడు తన తపశ్శక్తితో తక్షకుణ్ణి హోమగుండంలో పడకుండా వెనక్కు పంపేశాడు.

సర్పయాగం నిలిచిపోయింది. లోహితాక్షుడు చెప్పిన మాట అక్షరాలా జరిగింది. జనమేజయుడు లోహితాక్షుడికి తగిన రీతిగా ధన మిచ్చాడు; యజ్ఞంలో పాల్గొన్న సదస్యులందరికీ ఘనంగా దక్షిణ లిచ్చాడు; యాగ దీక్ష విరమిస్తూ అవభృత స్నానం చేశాడు.

తరవాత జనమేజయుడు అస్తీకుడితో, "అయ్యా, ఇప్పుడు నీకు సంతృప్తి కలిగిందిగదా? నేను అశ్వమేధయాగం చెయ్యబోతాను. దానికి నీవు తప్పక సదస్యుడుగా రావాలి!" అంటూ అతనికి మంచి సన్మానం చేసి పంపేశాడు. వాసుకి మొదలైనవారు తమ వంశ నిర్మూలనాన్ని ఆపిన అస్తీకుణ్ణి ఎంతగానో కొనియాడారు. అస్తీకుణ్ణి తలచుకుంటే తొలగిపోని పాములు తలలు పగిలి చచ్చేలాగా వాసుకి మొదలైన వారు అతనికి వరంకూడా ఇచ్చారు.



# ఐకమత్యమే బలం





# రాజైన బానిసపిల్ల

## 2

ఒకనాడు అలీషార్ తన భార్య అల్లిన తివాసీ ఒకటి మూటగట్టి తీసుకుని, దానిని విక్రయించటానికి బజారుకు బయలుదేరాడు. అతని కొక దళారీ ఎదురుపడి తివాసీ అమ్మి పెట్టటానికి ఒప్పుకున్నాడు. ఇద్దరూ దుకాణాల ముందుగా వెళుతూ బేరం చెబుతూండగా ఒక క్రైస్తవు డెదురుపడి ఆ తివాసీని అరవై దీనారాలకు కొంటా నన్నాడు. అలీషార్ అమ్మనంటే బేరం నూరు దీనారాలకు పెంచాడు.

కాని అలీషార్‌కు అమ్మటం ఇష్టంలేదు. ఎంచేతనంటే అతనికి క్రైస్తవులంటే అపనమ్మకమూ, అసహ్యమూనూ. అయితే దళారీ మాత్రం అతని చెవిలో ఇంత మంచి బేరం పోనివ్వ వద్దని సలహా ఇచ్చాడు. అసలు సంగతేమిటంటే ఆ క్రైస్తవుడు దళారీకి అదివరకే పది దీనారాలు లంచం పెట్టి ఈ బేరం కుదర్చమని కోరి ఉన్నాడు. తన తివాసీలనూ, తెరలనూ తెలియని వారికివ్వ వద్దని జముర్రుద్ హెచ్చరించి నప్పటికీ దళారీవాడి నిర్బంధంతో అలీషార్ బేరం ఒప్పుకున్నాడు

డబ్బు తీసుకుని అసంతృప్తిగా అలీషార్ ఇంటిదారి పట్టాడు. కొంతదూరం వెళ్ళి వెనక్కు తిరిగి చూస్తే తివాసీ కొన్నవాడు తన వెనకే వస్తూండటం అతనికి కనబడింది. అతను ఆగి, "మీ జాతివాళ్ళ కీ ప్రాంతంలో ఏమీ పని ఉండదే! ఎందు కిటు వస్తున్నావు?" అని క్రైస్తవుణ్ణి అడిగాడు.

"నా కీ వీధి చివరను కొంచెం పని ఉంది," అన్నాడు క్రైస్తవుడు. కాని అలీ తన ఇంటి గుమ్మం చేరుకునే సరికి పక్క

సి. మాధవరావు



సందులో నుంచి వచ్చి వాడు కూడా హాజ
రయాడు. "నన్నెందు కిలా వెంటాడు
తున్నావురా, పాపిష్టి వెధవా?" అన్నాడు
అలీషార్ కోపంగా.

"నేను కావాలని వెన్నంటి రాలేదు. నోరార్చుకుపోతున్నది, దాహానికి కాస్త నీరిప్పించండి, మిమ్మల్ని అల్లా కటాక్షిస్తాడు," అన్నాడు క్రైస్తవుడు.

ఎంత నీచుడికైతేమటుకు దాహమంటూంటే నీరు నిరాకరించటం ఎలా? అలీషార్ తలుపులు తెరిచి ఇంటోకి వెళ్ళి, నీటి కూజా తీసుకుని మళ్ళీ బయటికి పోబోతూండగా జముర్రుద్ తలుపు తెరిచిన అలికిడి విని ఇవతలికి వచ్చి, "ఇవాళ ఇంత అలస్య మయిందేం? తివాసీ అమ్ముడు పోయిందా? కొన్నవాడు పరువైన వర్తకుడా, లేక ఊరూ పేరూ లేనివాడా?" అన్నది.

"ఇవాళ అంగళ్ళలో రద్దీ జాస్తి కావటం చేత కొంచెం అలస్యమయింది. తివాసీని పరువైన వాడికే అమ్మాను," అని అలీషార్ బొంకాడు.

"ఆ నీ రెవరికి?" అని ఆమె అనుమానంగా అడిగింది.

"దళారీవాడికి. నాతో వచ్చాడు," అంటూ అలీషార్ బయటికి వెళ్ళాడు.



కాని బానిస మనసులో ఏదో ఆరాటం సాగింది. ఏదో ప్రమాదం జరగబోతున్నట్టు ఆమెకు తోచింది.

క్రైస్తవుడు వీధిలో నిలబడక తల వాకిలి గుండా నడవలోకి వచ్చేశాడు.

"దొంగ వెధవా, నా అనుమతి లేకుండా నా యింట్లో కెలా అడుగుపెట్టావు?" అని అలీషార్ గద్దించాడు.

"నిలబడటానిక్కూడా త్రాణలేక ఒక్క అడుగు లోపలికి వేశాను. ఇది నడవే గాని ఇల్లు కాదుగదా! ఇదీ వీధిలో జమే. ఒక్క క్షణం విశ్రాంతి తీసుకుని నా దారిన నే పోతాను," అన్నాడు క్రైస్తవుడు. అతను







అలీషార్ నుంచి కూజా అందుకుని, నీరు తాగి, కూజా అలీషార్‌కు తిరిగి ఇచ్చేశాడు. వెళ్ళి పోతాడని అలీషార్ ఎంతసేపు చూసినా ఆ క్రైస్తవుడు కదలలేదు.

"ఇంక వెళ్ళిపో!" అన్నాడు అలీషార్.

"అయ్యా, ఒక్క చిన్న ఉపకారం చేస్తే అది కలకాలం ఉంటుంది. అలాటి పనులు చేసే బుద్ధి తమకు అల్లా ఇవ్వలేదా? నా దాహమైతే తీరిందిగాని ఆకలి దహించుకు పోతున్నది. ఏమీ వద్దు, ఇంత ఎండిపోయిన రొట్టెముక్కా, ఉల్లిపాయా అయినా సరే నా మొహాన వేస్తే ఆకలి తీర్చుకుంటాను," అన్నాడు క్రైస్తవుడు.



"మా ఇంట్లో ఇంత ఆహారం కూడా లేదు. మాట్లాడక ఇక బయటికి నడు," అన్నాడు అలీషార్.

అప్పటికీ క్రైస్తవుడు కదల్లేదు. "ఇంట్లో ఏమీ లేకపోతే బజారులో దుకాణం నుంచి మీగడ రొట్టె అయినా తెప్పించండి, లేకపోతే అల్లాపై ఒట్టే! నేను తివాసీకి ఇచ్చిన నూరు దీనారాలు ఇంకా మీ వద్దనే ఉన్నాయిగద. ఆకలిగొన్న వాణ్ణి బయటికి తరమటం మీకు మాత్రం ఏమంత ప్రతిష్ఠ?" అన్నాడు అతను.

ఆ దుర్మార్గుడిపైన అలీషార్‌కు ఎంత మంటగా ఉన్నా వాడి కోరిక తీర్చక తప్ప లేదు. ఉన్నచోటి నుంచి కదల వద్దని క్రైస్తవుణ్ణి హెచ్చరించి, అలీషార్ బయటికి వెళుతూ తలవాకిలికి భద్రంగా తాళంపెట్టి, దుకాణానికి వెళ్ళి వెచ్చ వెచ్చని రొట్టెలూ, హల్వాలూ, పళ్ళూ, ఇతర అపక్వాహారాలూ కొనుక్కుని తిరిగి వచ్చాడు.

అవన్నీ చూసి క్రైస్తవుడు, "ఆహా, ఏమి అతిథిసత్కారం! ఇవన్నీ తెచ్చారెందుకు? వీటితో పదిమందికి విందు చేయవచ్చునే! తమరుకూడా నాతోబాటు భోజనం చెయ్యాలని నా ప్రార్థన," అంటూ అలీషార్‌ను నిర్బంధించి ఒప్పించాడు.

ఇద్దరూ భోజనానికి కూచున్నారు. భోజనం మధ్యలో క్రైస్తవుడు ఒక అరటి పండులో రహస్యంగా మత్తుమందు పెట్టి, "తమరీ పండు నా చేతి మీదుగా పుచ్చుకో వాలి," అని అలీషార్‌కు ఇచ్చాడు. అరటి పండు తింటూనే అలీషార్ స్పృహతప్పి పడిపోయాడు.

మరుక్షణమే క్రైస్తవుడు చివాలున లేచి వీధిలోకి వెళ్ళాడు. అక్కడ అప్పుడే అతని మనుషులు ఒక కంచర గాడిదతో సహా పొంచి ఉన్నారు. వారి వెంట ముసలివాడు రషీద్ అద్దీన్ కూడా ఉన్నాడు. ఈ ముసలి వాడే జముర్రుద్‌ను కొనటానికి ప్రయత్నించి నది. ఇతను వాస్తవానికి క్రైస్తవుడే. కాని వర్తకులలో వెలిగా ఉండకుండా ముసల్మా ననని అబద్ధం ఆడుతూ వచ్చాడు. ఈ క్రైస్త వుడు అతనికి సయాం తమ్ముడే. ఇతడి పేరు బర్సూమ్.

బర్సూమ్ తన అన్నతో తన పన్నాగ మంతా వివరంగా చెప్పాడు. అన్నదమ్ము లిద్దరూ, వారి మనుషులూ అలీషార్ ఇంట జొరబడ్డారు. జముర్రుద్ ఉండేచోటికి వెళ్లి, క్షణంలో ఆమె నోట గుడ్డలు కుక్కి, ఆమెను కంచరగాడిదపై వేసి, తిన్నగా ముసలి రషీద్ ఇంటికి తీసుకుపోయారు.



ముసలాడు ఆమెను తన ఇంటిలోని మారుమూల గదిలోకి తీసుకుపోయి, ఆమె నోట కుక్కిన గుడ్డలు తీయించి, "జముర్రుద్, ఇప్పుడు నీవు నా చేతిలో చిక్కావు. ఆ వెధవ అలీషార్ ఈసారి నిన్నెలా కాజే సుకు పోతాడో చూస్తాను. నీవు ఎలాగో నా దానివికాక తప్పేది లేదు. అందుచేత నీ మతం విడిచిపెట్టి నాలాగే క్రైస్తవమతం పుచ్చుకో. లేకపోతే నిన్ను నా నౌకర్లచేత చిత్రహింస చేయిస్తాను. నీ పాట్లు కుక్కలు కూడా పడవు," అన్నాడు.

జముర్రుద్ కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ కూడా, "ముసలి పీనుగా, నన్ను

ముక్కలు ముక్కలుగా కోసినా, నా మతాన్ని వదులుకోను," అన్నది.

దానిమీదట ఆ ముసలివాడు ఆమెను తన చేతులు నొచ్చేదాకా కొట్టి, "దీన్ని వంట ఇంటి బానిసలతో చేర్చండి. అన్నమూ, నీరూ ఇవ్వకండి," అని నౌకర్లతో చెప్పాడు.

* * *

అక్కడ అలీషార్ కొంతసేపటికి మత్తు వదిలి లేచి కూచుని, "ఓ జముర్రుద్!" అని కేకపెట్టాడు, కాని జవాబు లేదు. అతను లేచి ఆమె ఉండే గదికి వెళ్ళి చూస్తే ఆమె వల్లెవాటూ, రుమాళ్ళూ చిందర వందరగా పడి ఉన్నాయి. ఇవి చూడగానే క్రైస్తవుడు జ్ఞాపకం వచ్చాడు. వాడే తన ప్రియురాలిని తీసుకుపోయాడని అర్థమై అలీషార్‌కు దుఃఖం పొంగి వచ్చింది. ఆ దుఃఖం శృతి మించి అతని మతే పోయి నట్టయింది. అతను, "అయ్యో, జముర్రుద్!" అని కేకలు పెట్టి, రొమ్ము బాదుకుంటూ వీధిన పడ్డాడు. త్వరలోనే అనేకమంది కుర్రాళ్ళు, "పిచ్చివాడు! పిచ్చివాడు!" అని కేకలు వేస్తూ అతని వెంట పడ్డారు. అతన్నెరిగిన వాళ్ళుకూడా, "పాపం, పిచ్చెత్తింది కాబోలు," అని జాలిపడ్డారు.

ఇలా అతను నగరమంతా కలయ దిరుగు తుండగా ఒక ముసలిది అతని కెదురు పడి,



"నా తండ్రీ! నీ కీ స్థితి ఎందుకు వచ్చింది, నాయనా?" అని అడిగింది.

అలీషార్ తన దీన చరిత్ర ఆమెతో చెప్పుకున్నాడు. ఆ ముసలిది దీర్ఘంగా ఆలోచించి, "చూడూ, బజారుకు వెళ్ళి ఆడవాళ్ళు కొనే పూసలూ, గాజులూ, వెండి పూతగల ఉంగరాలూ, జుమికీలూ కొని ఒక తట్టలో పెట్టి తేగలవా? ఆ తట్ట నెత్తిన పెట్టుకుని ఇల్లిల్లూ తిరిగి, నీ జముర్రుద్ ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని, చాతనైతే నీకు చేర్చటానికి యత్నిస్తాను," అన్నది.

ఈ మాట విని అలీషార్‌కు ప్రాణం లేచి వచ్చింది. అతను ఆనందాశ్రువులు రాల్చి, ఆమె చేతులు కళ్ళ కద్దుకుని, బజారుకు వెళ్ళి ఆమె కోరిన వస్తువు లొక తట్టలో పెట్టి తెచ్చి ఇచ్చాడు. ఆమె ఇంటికి వెళ్ళి దుస్తులు మార్చుకుని, ముఖానికి బురఖా వేసుకుని, తట్ట నెత్తిన పెట్టుకుని, కర్ర ఒకటి తాటించుకుంటూ నగరంలో ఉండే గొప్ప వర్తకుల ఇళ్ళకెల్లా వెళ్ళి ఆడవాళ్ళ నందరినీ చూస్తూ రాసాగింది.

చివరకామె రషీద్ ఇంటికి కూడా వెళ్ళింది. ఆమె అమ్మకానికి తెచ్చిన వస్తువులు చూడటానికి ఆడ బానిస లందరూ మూగారు. వారి కామె అన్ని వస్తువులూ







చూపటమేగాక చాలా తక్కువ ధరలు చెప్పింది. అందరూ తమకు కావలిసిన వస్తువులు కొనుక్కున్నారు.

ముసలిది చుట్టూ కలయ చూసేసరికి, దెబ్బల బాధతో తీసుకుంటూ ఒక చాప మీద పడి ఉన్న జముర్రుద్ కనిపించింది. వెంటనే ఆమెకు ఆ మనిషే తాను వెతుకుతున్న జముర్రుద్ అని తోచింది; ఎందుకంటే మిగతా బానిసలు ఆమెను గురించి చెప్పిన వివరాలు అలీషార్ చెప్పిన వివరాలకు అతికినట్టుగా సరిపోయాయి.

అందుచేత ముసలిది ఆమెను సమీపించి, "నీవు అలీషార్ బానిసవు కావా అమ్మా? అతను నన్ను నీ కోసమే పంపాడు రేపు చీకటిపడే సమయానికి వంటింటి కిటికీ వద్ద వేచి ఉండి, వీధి నుండి ఈల వినబడగానే జవాబుగా ఈల వేసి, నిర్భయంగా బయటికి వచ్చెయ్యి. అతను నీ కోసం వేచి ఉంటాడు," అని చెప్పింది.

ఆ తరవాత ముసలిది అలీషార్ వద్దకు వెళ్ళి, "రేపు చీకటి పడే వేళకు ఫలాని కిటికీ కింద వీధిలో వేచి ఉండు," అంటూ అతనేమేం చెయ్యాలో చెప్పింది. అలీషార్ ఆమెకు తన కృతజ్ఞత చెప్పుకుని బహుమానంగా ఏదో ఇయ్యబోతే, ముసలిది తీసుకోక, "నీ ప్రయత్నం నిర్విఘ్నంగా సాగితే అదే పదివేలు," అని తన ఇంటికి వెళ్ళిపోయింది.

మర్నాడు చీకటిపడే సమయానికి అలీషార్ రషీద్ ఇంటి బయట వంటింటి కిటికీ వద్దకు చేరి, అక్కడ గోడ నానుకుని సమయం కోసం ఎదురు చూస్తూ కూచున్నాడు. కాని అప్పటికి రెండు రాత్రులుగా నిద్రలేని కారణం చేత అతనికి నిద్రముంచుకు వచ్చేసింది.

ఆ సమయంలో ఒక గజదొంగ అటుగా వచ్చాడు. ఆ రాత్రి ఆ ఇల్లు కొల్లగొట్టే ఉద్దేశంతో వాడు ఇంటిని తనిఖీ చేయటానికి





వచ్చాడు. వాడటుగా వస్తూనే నిద్రపోతున్న అలీషార్‌ను చూశాడు. ఖరీదైన అతని దుస్తులు చూసి వాడికి కళ్ళుకుట్టాయి. వాడు నేర్పుగా అలీషార్ తలపాగా, పై బట్టా సంగ్రహించి తాను ధరించాడు.

అదే సమయంలో ఎత్తున ఉండే కిటికీ తెరుచుకున్నది. ఒక స్త్రీ ఆకారం దొంగ కంట పడింది. ఆ స్త్రీ కిందికి చూసి ఈల వేసింది. దొంగవాడు తిరిగి ఈల వేశాడు. మరుక్షణం లోపలి నుంచి ఒక తాడు కిందికి జారింది. కిటికీలో నుంచి కనబడిన స్త్రీ కిటికీలోకి ఎక్కి ఆ తాడు పట్టుకుని కిందికి వచ్చింది. దొంగ మరి ఆలోచించిక ఆమె దిగటానికి తన వీపు ఇచ్చి, బలంగలవాడు కావటంచేత ఆమెను మోసుకుంటూ వాయు వేగంతో పరిగెత్తసాగాడు.

దొంగను చూసి తన భర్తే అనుకున్న జముర్రుద్ ఆ దొంగతో, "అలీషార్, నీకు నడిచే శక్తికూడా లేదని ముసలిది చెప్పింది గదా, గుర్రంలాగా పరిగెత్తే శక్తి నీ కెలా వచ్చింది?" అని అడిగింది. ఈ ప్రశ్న విని దొంగ తన వేగం మరింత హెచ్చించాడు. అనుమానం వేసి జముర్రుద్ దొంగవాడి ముఖం తడివింది. అతని గడ్డం చీపురు కట్టలాగా ఆమె చేతికి తగిలింది. ఆమెకు చెప్పరాని భయం పట్టుకున్నది. "ఎవడవురా నువ్వు? ఎవడవురా?" అంటూ ఆమె వాణ్ణి ముఖం మీద కొట్టింది.

ఈసరికి దొంగ నిర్మానుష్యమైన చోటికి చేరాడు. వాడు జముర్రుద్‌ను కిందికి దించి, "నే నెవరినా? నా పేరు జవాన్, దొంగను. మా ముఠాలో నలభై మందిమి ఉన్నాం. మాకు అడదన్నది లేదు. నీ అదృష్టం. నువ్వు మా అందరికీ పెళ్ళాం కాబోతున్నావు!" అన్నాడు.

ఈ మాట చెప్పి వాడు ఆమెను మళ్ళీ తన వీపున ఎత్తుకుని కొండల్లో తమ ముఠా ఉండే గుహకు తీసుకుపోయాడు.



93

జవాన్ జముర్రుద్‌ను తన ముసలి తల్లికి అప్పగించి, "ఇవాళ రాత్రి మేం చెయ్యవలసిన దొంగతనాలు కొన్ని ఉన్నాయి. రేపు మధ్యాహ్నానికల్లా మేము సలభై మందిమీ వస్తాము. అంతదాకా ఈ మనిషిని జాగ్రత్తగా చూస్తూ ఉండు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి జముర్రుద్ కన్ను మూయలేదు. తెల్లవారే లోపుగా ఆమె తన భయాన్ని వదిలించుకుని ధైర్యాన్ని చిక్కబట్టుకోగలిగింది. ఆమె తప్పించుకు పారిపోయే ఆలోచన కూడా చేసింది.

ఆమె ముసలిదానితో, "అత్తా, మధ్యాహ్నం దాకా వాళ్ళంతా రారుగదా? అందాకా మనకు పనీపాటూ ఉండదు. అలా ఎండలో కూచుందామా? నీ తల్లో పేలు చూస్తాను!" అన్నది.

ముసలిది, "అంతకంటేనా? ఈ దిక్కుమాలిన గుహలో ఒక తలంటూ, పాడా? తల నిండా పేలే. రాత్రిళ్ళు ఒళ్ళంతా పాకుతాయి. వాటిని వదలగొట్టితివా నిన్ను ఎంత బాగా చూడాలో అంతబాగా చూస్తాను," అన్నది. ఇద్దరూ ఎండలో చేరారు. జముర్రుద్ ముసలిదాని తల దువ్వి చాలా భాగం పేలు తీసేసింది. తరవాత జుట్టు పాయలు తీస్తూ ఈళ్ళు గోళ్ళతో కుక్క సాగింది. ఆమె గోళ్ళ కింద ఈళ్ళు చిటుకు చిటుకుమంటూంటే ముసలిదానికి జోకొట్టినట్టయి నిద్ర వచ్చేసింది.

జముర్రుద్ ముసలిదాన్ని వదిలేసి చప్పున గుహలోకి వెళ్ళింది. లోపల ఎన్నో రకాల దుస్తులున్నాయి. అన్నీ దొంగిలించినవే. జముర్రుద్ మగవాడి దుస్తులు ధరించింది. ఖరీదైన తలపాగా పెట్టుకున్నది. బయటికి వచ్చి, అక్కడ కట్టేసి ఉన్న ఒక గుర్రాన్నెక్కి, దేవుణ్ణి స్మరించుకుని శరవేగంతో బయలుదేరిపోయింది.

—(ఇంకా వుంది)





# నౌకరు నియమాలు

గుండు భీమన్న జమీందారుగారి పిల్లను పెళ్ళాడి గొప్పవాడయాడు. అల్లుడుగారికి ప్రత్యేకంగా ఒక నౌకరు కుర్రాడుండి, అతను చెప్పే పనులన్నీ చేస్తూండటం భావ్యంగా ఉంటుందని జమీందారుగారు అనుకున్నాడు. జమీందారుగారి గుమాస్తా అల్లుడుగారి కోసం పది, పన్నెండేళ్ళ కుర్రాణ్ణి ఒకణ్ణి పట్టుకొచ్చాడు. వాడికి ఏడాది కింత జీతం ఇచ్చేట్టూ, ఒక జత బట్ట లిచ్చేట్టూ మాట్లాడుకున్నారు.

ఆ సాయంకాలం భీమన్న తోటలో ఒంటరిగా ఉన్న సమయంలో నౌకరు కుర్రాడి తండ్రి వచ్చి, "బాబుగారూ, మా అబ్బాయిని తమరికి నౌకరుగా ఏర్పాటు చేశారు. వాడికి తిండీ, బట్టా బాగానే జరిగి పోతుందని నాకు తెలుసు ననుకోండి. జీతం డబ్బులుకూడా ఇస్తామన్న దాని కొక పావలా ఎక్కువే ఇస్తారుగాని లోపం చెయ్యరు. అయితే రెండు విషయాలు తమరిని ముఖ్యంగా కోరదలిచాను," అన్నాడు.

"ఓ, తప్పకుండా కోరు," అన్నాడు భీమన్న.

"వాడికి ప్రతి శనివారమూ అభ్యంగనం అయేటట్టు తమరు చూడాలి," అన్నాడు నౌకరు తండ్రి.

"అభ్యంగన మంటే ఏమిటి?" అని భీమన్న అడిగాడు.

"నూనెతో స్నానం చేయించాలి. ఈ మాట ఎందుకు తమతో ప్రత్యేకంగా మనవి చేస్తున్నానంటే, వాడు నూనె చూడ గానే పారిపోతాడు. నూనెలో ఎంతసేపు నానితే అంత మంచిది. అందుచేత బల వంతాన అయినా సరే వాడికి నూనె తలంటు పోయించాలి," అన్నాడు నౌకరు తండ్రి.







"ఓ, అలాగే చేద్దాం," అన్నాడు భీమన్న.

"మరొక్క విషయ మేమంటే నెల కొక క్షవరం వాడి చేత చేయించండి. ఈ రెండే నేను తమరిని ప్రత్యేకంగా కోరేవి!" అన్నాడు నౌకరు తండ్రి.

భీమన్న రెంటికీ అంగీకరించాడు. జ్ఞాపకం ఉంచుకుని ఈ రెండు పనులూ వాడి చేత చేయిస్తానని ఆ మనిషికి మాట కూడా ఇచ్చి పంపేశాడు. ఆ మనిషి తనను స్వయంగా అడిగాడు గనక ఈ పనులు మరొకరికి పురమాయించక, భీమన్న శని వారం ఎప్పుడు వస్తుందా అని రోజులు లెక్కిస్తూ కూచున్నాడు.

శనివారం రానే వచ్చింది. భీమన్న తెల్ల వారుతూనే లేచి, తన నౌకరును పిలిచి, "ఒరే, గిడ్డంగికి పోయి ఒక నూనె డబ్బా తెమ్మన్నానని చెప్పి తీసుకురా!" అన్నాడు.

"అల్లుడుగారు తెమ్మన్నారు. ఎందుకో నాకు తెలియదు," అని గిడ్డంగిలో ఉండే వాడికి చెప్పి నౌకరు నూనెడబ్బా తెచ్చాడు.

భీమన్న తన నౌకరును స్నానాల గదిలోకి తీసుకుపోయి, స్నానం చేసే తొట్టిలో నిలబడ మని, డబ్బాడు నూనె వాడి నెత్తిన దిమ్మ రించాడు. కుర్రాడు లబోమని ఏడుపులం కించు కున్నాడు.

"గొంతు ఎత్తావంటే చంపేస్తాను, వెధవా! నీ సంగతంతా నీ తండ్రి నాతో ముందే చెప్పేశాడు. ఏడిచి గీపెట్టినా సరే నీకు ప్రతి శనివారమూ నూనెతో స్నానం తప్పదు. ఎంత నానితే అంత మంచిదని నీ తండ్రి అన్నాడు. అందుచేత నేను రమ్మన్నదాకా బయటికి రాకు," అని భీమన్న కుర్రాణ్ణి గదమాయించి, స్నానాల గది పులుపు గొళ్ళెం పెట్టి ఇవతలికి వచ్చేశాడు. కుర్రాడు లోపలి నుంచి ఏడుస్తూ పెడబొబ్బలు పెట్టసాగాడు.

సరిగా ఆ సమయానికే భీమన్న భార్య మహాలక్ష్మి అటుగా వచ్చి, "ఏమండీ,

మీ నౌకరలా ఏడుస్తున్నా డెందుకూ? వాణ్ణి లోపల పెట్టి తలుపు మూశారేం? ఏమైనా చేశాడేమిటి?" అని అడిగింది.

"ఇది నీకు సంబంధించిన విషయం కాదులే. వాడి తండ్రి ఈ బాధ్యత స్వయంగా నా మీద పెట్టాడు. ఏడిచి రాగాలు పెట్టినా సరే వదలకుండా వాడికి ప్రతి శని వారమూ నూనెతో స్నానం చేయించ మన్నాడు. అభ్యంగన మంటే అదేటగా?" అన్నాడు భీమన్న.

తన భర్త కుర్రాడి నెత్తిన డబ్బాడు నూనె పోసేసిన సంగతి మహాలక్ష్మితోబాటు ఇంటిల్లి పాతికీ తెలిసిపోయింది. అల్లుడు గారిలాటి పని ఎందుకు చేశారా అని అందరూ ఆశ్చర్య పడిపోయారు. మహాలక్ష్మి వారితో, "ఆయనకు కోపం వచ్చి చిరాకుతో తన నౌకరు నెత్తిన డబ్బాడు నూనె కుమ్మరించేశారు. ఆయనకు కోపం రావటానికి కారణమేమంటే, ప్రతి శనివారమూ తలంటు స్నానం చెయ్యటం వారికి అల వాటుట. ఇక్కడ మనకా అలవాటు లేదు. అందుచేత ఆయనకు కోపం వచ్చింది. అందుచేత మన ఇంటకూడా అందరమూ శనివారం శనివారమూ నూనె తలంట్ల ఏర్పాటు చేసుకుంటే సరిపోతుంది," అని భర్త అవివేకాన్ని కప్పేసింది. ఈ తలంట్ల



ఏర్పాటు నౌకర్లకు కూడా జరగటంచేత భీమన్న నౌకరు కుర్రాడి నియమాలలో ఒక దాని బెడధ తీరిపోయింది.

కాని రెండో నియమం మిగిలిపోయింది. భీమన్న నెల పూర్తి అయినదాకా కనిపెట్టు కుని ఉండి, నౌకరును పిలిచి, "ఒరే, మన దివాణంలో ఎవరెవరు క్షవరం చేయించు కుంటారో కనుక్కురా!" అన్నాడు.

నౌకరు వెళ్ళి పని వాళ్ళందరినీ అడిగి వచ్చి, "అందరూ చేయించుకున్నారు టండీ," అన్నాడు.

"పోనీ నేనే చేయించుకుంటాను. నీ మంగలికత్తి ఏదీ?" అన్నాడు భీమన్న.

"నా దగ్గిర మంగలి కత్తి లేధరండీ," అన్నాడు నౌకరు కుర్రాడు తెల్లబోయి.

"నెల కొక క్షవరం చేయించమన్నాడు గదా నీ తండ్రి. కత్తి ఎందు కిచ్చాడు కాదూ? పో, ఇంటికి పోయి నీ తండ్రి నడిగి వెంటనే కత్తి పట్టుకువచ్చి నాకు క్షవరం చెయ్యి. ఇలా చేస్తానని నీ తండ్రికి మాట ఇచ్చాను," అన్నాడు భీమన్న.

"నాకు క్షవరం చెయ్యటం చేతకాదు," అంటూ కుర్రాడు లబలబ లాడాడు.

"తెలియకపోతే నేర్చుకోవాలి. నువు వట్టి మొండి వెధవలాగున్నావే. నిన్ను మంచి మంగలిగా తయారు చెయ్యాలని నీ తండ్రి అనుకుంటూంటే నువు తెలియదంటే ఎలా?" అన్నాడు భీమన్న.

మళ్ళీ మహలక్ష్మి అక్కడికి వచ్చింది. సంగతంతా విన్నది. "వాడి చేతిలో రెండణాల డబ్బులు పెట్టండి. వెళ్ళి క్షవరం చేయించుకువస్తాడు. వాడి తండ్రి మిమ్మల్ని కోరింది అంతే," అన్నది.

"వాడి చేత నెలకొక క్షవరం చేయించ మంటే రెండణా లివ్వమనటమని నా కెలా తెలుస్తుందీ? అడిగేదేదో స్పష్టంగా అడగ కూడదూ?" అని భీమన్న గొణుక్కున్నాడు.

[పై మాసం మరొక సంఘటన]





# కెరటాల కరణం

బ్రిటిషు గవర్నమెంటు కొత్తల్లో కెరటాల అగ్రహారంలో కామశాస్త్రి కరిణీకం చేసే వాడు. కామన్న సామాన్యుడు కాడు, యోధానయోధుడు. లంచాలు దారుణంగా పుచ్చుకునేవాడు. వాళ్ళూ వీళ్ళూ అనే తారతమ్యం లేకుండా పుచ్చుకునేవాడు.

ఆ గ్రామంలో ఒక కలెక్టరుకు భూమి ఉంది. ఆ భూమికి శిస్తు కట్టడానికి డబ్బు పంపించారు. పట్టా మామూలు ఇవ్వందే శిస్తు జమ కట్టుకోనని తిప్పి పంపించేశాడు కరణం. కలెక్టరు దొరవారు ఎన్ని ప్రయత్నాలు చేసీ లాభంలేకపోయింది.

ఇదే సమయంలో గ్రామంలోని యావన్మందీ, 'ఈ కరణంగారు లంచాలు పుచ్చుకుంటున్నారు ; వీరి బాధ భరించలేకుండా ఉన్నాం' అని పిటిషను పెట్టుకున్నారు. పిటిషను రివిన్యూబోర్డుకూ, పైవారికీ వెళ్ళింది. ఒక కాపీ లండనులోని ప్రీవీ కౌన్సిలుకు కూడా పంపారు.

ఇటువంటి వాడివల్ల ముప్పు వస్తుందని, కరణంగారికి ఏమి శిక్ష విధించాలో ఆలోచించటానికి ఒక కమిటీని వేశారు. ఒక సంవత్సరంపాటు మహాసముద్రం మీద ఒక లంకలో వదిలిపెట్టి, సంవత్సరానికి కావలిసిన గ్రాసమూ, సామాన్లూ ఇచ్చేటట్టు నిర్ణయం జరిగింది.

ఈ ఉత్తరువు ఇండియా గవర్నమెంటుకు చేరగానే కరణంగారికి తాకీదు వచ్చింది. కావలిసిన సామగ్రి కోసం దరఖాస్తు పెట్టుకోమన్నారు. కరణంగారు ఇతర సామాన్లతోబాటు పది రీముల కాగితాలూ, సిరాబుడ్లూ, కలాలూ, పెనసళ్ళూ కావాలని దరఖాస్తు పెట్టుకున్నాడు. ఈ జాబితా చూసి కరణంగారు రామకోటి వ్రాసు

శ్రీమతి చల్లా లక్ష్మి



కుంటాడు కాబోలనుకుని అధికార్లు అన్నీ ఇప్పించి, స్టీమరు ఎక్కించి పంపారు.

కరణంగారు లంక చేరి, తెల్లకాగితాలన్నీ పుస్తకాలు కుట్టుకుని, గళ్ళు గీసుకుని, వ్రాత మొదలుపెట్టాడు. 10 కెరటాలు పడ్డుకు వచ్చినవి, అందులో 8 కెరటాలు తిరిగిపోయినవి ; బకాయి 2 కెరటాలు— ఈ విధంగా తన యిష్టం వచ్చినట్టు వ్రాసుకు పోతున్నాడు. పుస్తకాలు నిండిపోతున్నాయి.

ఇంతలోనే ఈస్టిండియా కంపెనీవారి వర్తకపు ఓడ ఆ లంకకు వచ్చింది. కరణం గారు దాన్ని ఆపుచేసి, వంద రూపాయలకు చిత్తు రసీదు వ్రాసి, సొమ్ము తెమ్మని అడిగాడు. స్టీమరులో ఉండే దొర, "ఈ రసీదేమిటి? నీ వెవరు?" అని అడిగాడు.

"సొమ్ము చెల్లించనిదే స్టీమరు రేవులో నుంచి కదలటానికి వీల్లేదు. నేను కెరటాల కరణాన్ని. ఇవిగో నా రికార్డు పుస్తకాలు," అన్నాడు కరణంగారు.

దొర నూరు రూపాయలు ఇచ్చి రసీదు వెనక ఇంగ్లీషులో "కెరటాల కరణానికి ఇచ్చిన సుంకం" అని వ్రాసుకున్నాడు. ఇది మొదలు కరణంగారు అటుగా వచ్చిన ప్రతి ఓడ నుంచీ వందేసి రూపాయలు వసూలుచేశాడు. ఆయన ఇచ్చిన రసీదు లన్నీ ఇంగ్లండులో హెడ్డాఫీసుకు చేరాయి. అక్కడి ఆడిటర్లు చిత్తురసీదులే ఉన్నాయి, అచ్చురసీదులు పంపవలిసిందనీ, లేకపోతే లెక్కలు తేలవనీ ఇండియాకు వ్రాశారు.

ఈ ఉత్తరం ఇండియా గవర్నమెంటు నుంచి, గవర్నరుకూ, రివిన్యూబోర్డుకూ వెళ్ళి చివరకు జిల్లా కలెక్టరు వద్దకు చేరింది. తీరా విచారిస్తే చిత్తురసీదు లిచ్చినవాడు శిక్ష అనుభవిస్తున్న కెరటాల కరణం కామశాస్త్రి అని తేలింది. ఇంత సమర్థుడైన వాడికి శిక్ష అనవసరమనీ, కరణాల మామూళ్ళు లంచాలు కావనీ ప్రభుత్వం నిర్ణయించి, కామశాస్త్రి శిక్ష రద్దు చేసింది.





# అరణ్యకాండ

పంచవటిలో ఆశ్రమం కల్పించుకుని తమ పర్ణశాలలో సీతా రామ లక్ష్మణులు సుఖంగా ఉంటున్నారు. హేమంత ఋతువు వచ్చింది. ఒకనాటి తెల్లవారుఝామున వారు ముగ్గురూ స్నానం చెయ్యటానికి గోదావరి వద్దకు పోతూ ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పుకోవటంలో లక్ష్మణుడు భరతుణ్ణి మెచ్చుకుని, అటువంటి వాడికి తల్లి అయికూడా దుర్మార్గురాలయినందుకు కైకేయిని నిందించాడు. రాముడు అడ్డం వచ్చి, "కైకేయిని తిట్టటం మానేసి భరతుణ్ణి గురించే మాట్లాడు," అన్నాడు. తాను భరత లక్ష్మణ శత్రుఘ్నులతోనూ సీతతోనూ కలిసి ఎప్పుడు రాజ్యం చేస్తానో గదా అని రాముడు విచారించాడు.

వారు ముగ్గురూ గోదావరిలో స్నానాలు చేసి, ఆశ్రమానికి తిరిగి వచ్చి, ఉదయం చేయవలసిన కర్మకాండ అంతా ముగించుకుని పర్ణశాలలో కూచుని ఉండగా అటుగా ఒక రాక్షస స్త్రీ వచ్చింది. ఆమె రావణుడి చెల్లెలైన శూర్పణఖ. దాని ముఖం వికారం. దాని కొక పెద్ద పొట్టా, ఎర్రని జుట్టూ, భయంకరమైన గొంతూ ఉన్నాయి. వయసు మళ్ళినది. ఆ అనాకారి రాముణ్ణి చూస్తూనే మోహించింది. ఆమె రాముణ్ణి పలకరిస్తూ, "వేషం చూడబోతే మునివి. వెంట ఆయుధాలున్నాయి, భార్య ఉన్నది. నీవు మా రాక్షసుల దేశాని కెలా వచ్చావు?" అన్నది.

రాముడు మంచిగా ఆమెకు తన వాస్తవ వృత్తాంతం చెప్పాడు. సీత సంగతి కూడా







భార్యగా ఉండిపోవా లనిపిస్తున్నది. నేను శక్తిగల దాన్ని. ఈ సీతను విడిచిపెట్టి నన్ను కట్టుకో. ఈమె వికారంగా ఉంది; కురూపి; నీకు తగదు. మనిద్దరికీ ఈడూ జోడూగా ఉంటుంది. మనం హాయిగా ఈ దండకారణ్యమంతా విహరించుదాం," అన్నది శూర్పణఖ.

రాముడు శూర్పణఖతో, "నా కొక భార్య ఉండనే ఉన్నది. నా భార్య అంటే నాకు చాలా ఇష్టంకూడానూ. నీవు చూడబోతే గొప్ప వంశానికి చెందినదానివి. నీకు సవతి ఉండటం ఉచితం కాదు. ఇతను, చూడు, నా తమ్ముడు. అందగాడు, పరాక్రమవంతుడు; భార్యను వెంటపెట్టుకు రాకుండా వచ్చి, బ్రహ్మచారిగా ఉంటున్నాడు. ఇతన్ని కట్టుకున్నావంటే నీకు సవతి పోరు తప్పుతుంది," అన్నాడు.

శూర్పణఖ వెంటనే రాముణ్ణి వదిలి లక్ష్మణుడి వద్దకు వెళ్ళి, తనను భార్యగా చేసుకోమన్నది.

లక్ష్మణుడు నవ్వుతూ, "అయ్యో, ఎంతో సుకుమారివి. నేనే సేవకుడిలాగా జీవిస్తున్నాను. నన్ను పెళ్ళాడితే నీవు కూడా దాసీదానివై పోతావు. నా యజమాని రాముడు. అతనికే రెండవ భార్యవుగా

చెప్పి అతను, "ఇంతకూ నీ వెవరు? ఎవరి కుమార్తెవు?" అని అడిగాడు.

"నా పేరు శూర్పణఖ. కామరూపినిని. ఒంటరిగా అరణ్యమంతా తిరుగుతూంటాను. నీవు రావణుడి పేరు వినే ఉంటావు. గొప్ప బలపరాక్రమాలు గలవాడు; విశ్వవసుడి కుమారుడు; రాక్షసరాజు. అతడు నా అన్న. ఎప్పుడూ నిద్రపోయే కుంభకర్ణుడు కూడా నా సోదరుడే. విభీషణుడు నా సోదరుడే గాని, అతడికి రాక్షస లక్షణాలు లేవు. మహా పరాక్రమవంతులు ఖర దూషణులు నా సోదరులు. నిన్ను చూస్తుంటే ఈ నా వారందరినీ వదిలేసి నీకు





ఉండటం మంచిది. నీ వంటి సుందరాంగిని పెళ్ళాడినాక రాముడు తన మొదటి భార్యను వదిలేస్తాడు. ఎందుకంటే, ఆమె వికారంగా ఉంటుంది, అంతే కాక ముసలిది," అన్నాడు.

రామ లక్ష్మణులు తనను వేళాకోళం పట్టిస్తున్నారని శూర్పణఖ గ్రహించలేక పోయింది. ఆమె రాముడి దగ్గిరికి పోయి, "ఈ ముసలి కురూపిని కట్టుకుని నా అందాన్ని కాలదన్నుతున్నావు. దీన్నిప్పుడే తినేస్తాను. ఆ తరవాత సవతి బెడద లేకుండా మనిద్దరమూ సుఖంగా ఉండవచ్చు," అని చెప్పి సీత మీదికి వెళ్ళింది. సీత భయపడి పరిగెత్తితే శూర్పణఖ ఆమె వెంట పడింది.

రాముడు లక్ష్మణుడితో, "దుష్టులతో పరిహాసం ఎంత చెడ్డదో చూశావా? సీతకు అపాయం రాకుండా చూడు. ఈ శూర్పణఖను అంగహీనగా చెయ్యి," అన్నాడు. లక్ష్మణుడు రాముడి పక్కనే ఉన్న కత్తి తీసుకుని శూర్పణఖ ముక్కూ, చెవులూ కోసేశాడు.

శూర్పణఖ బాధతో పెద్దపెట్టున అరిచి, తాను వచ్చిన దారినే మహారణ్యంలో పడి పారి పోయింది.

జనస్థానంలో ఖరుడు అనేకమంది ఇతర రాక్షసులతో సహా కూచుని ఉన్న చోటికి, రక్తం కారుతూ శూర్పణఖ వచ్చి చేరి నేల మీద పడిపోయింది. నెత్తురు వరదలు కారుతూ వికార రూపంలో తన చెంత వచ్చి పడిన శూర్పణఖను చూసి ఖరుడు, "నన్ను చూసి మూడు లోకాలవారూ భయపడతారు గదా, నిన్ని విధంగా చేసి తన ప్రాణాల మీదికి తెచ్చుకున్న వాడెవడు?" అని అడిగాడు.

శూర్పణఖ అతనితో సీతా రామ లక్ష్మణులను గురించీ, వారు తనకు చేసిన పరాభవం గురించీ చెప్పి, "నీవు వారి



ముగ్గురినీ చంపి వారి రక్తం తెప్పిస్తే తాగేస్తాను. ఇదే నా కోరిక," అన్నది.

ఖరుడు తన అనుచరులలో పధ్నాలుగు మందిని ఏరి, "మీరు వెళ్ళి, శూర్పణఖ చెప్పే ముగ్గురినీ చంపి, వాళ్ళ రక్తం శూర్పణఖ కివ్వండి," అని ఆజ్ఞాపించాడు. వారు పధ్నాలుగురూ శూర్పణఖను వెంట బెట్టుకుని రాముడి పర్ణశాలకు వచ్చారు. శూర్పణఖ సీతా రామ లక్ష్మణులను వారికి చూపి, "ఆ ముగ్గుర్నీ వెంటనే చంపెయ్యండి," అన్నది.

వారంతా ఆయుధాలతో సహా రావటం గమనించి రాముడు, లక్ష్మణుడితో, "వీళ్ళ సంగతి నేను చూస్తాను. నీవు సీత వెంట ఉండు," అని చెప్పి, రాక్షసుల కెదురు వెళ్ళి, "మీరంతా ఏమని నా మీదికి దండెత్తి వచ్చారు? ఇక్కడి మునులను రాక్షస బాధ నుండి కాపాడతానని మాట ఇచ్చి ఈ ధనుర్బాణాలు వెంట పెట్టుకుని ఉన్నాను. నా చేతిలో చావాలని లేనట్టయితే వెంటనే పారిపొండి," అని చెప్పాడు.

రాక్షసులా మాటలు విని మండిపడి, "నీవు మా దొర అయిన ఖరుడికి కోపం తెప్పించావు. నిన్ను చంపి పోవటానికే వచ్చాం. మేము చాలా మందిమి; నీవు ఒక్కడివి. అందుచేత నీకు చావు తప్పదు," అంటూ పధ్నాలుగు మందీ తమ చేతుల్లో ఉన్న శూలాలు రాముడి పైన విసిరారు. రాముడు పధ్నాలుగు బాణాలతో ఆ శూలాలన్నిటినీ దారిలోనే ఖండించి, వాటినే మళ్ళీ తీసుకుని వింటితో ఎక్కుపెట్టి పధ్నాలుగు మంది రాక్షసులనూ కొట్టాడు. అందరూ పడిపోయి ప్రాణాలు వదిలారు.

ఇది చూసిన శూర్పణఖ కంగారు పడి, పెద్దపెట్టున అరుస్తూ, పరిగెత్తి పోయి మళ్ళీ ఖరుడి సమీపాన కుప్పకూలిపోయింది. ఖరుడామెను చూసి చిరాకు పడుతూ, "ఇంకా ఎందుకు ఏడ్చి, పొర్లిగింతలు పెడుతున్నావు?





ఇప్పుడే గద నీ పని చేసుకు రమ్మని పద్నాలుగు మంది మెరికలలాటి వాళ్ళను పంపాను? వాళ్లు అజేయులు. ఇక ఊరడిల్లు!" అన్నాడు.

"నీవు పంపనూ పంపావు, వారంతా ఆ రాముడి చేత చావనూ చచ్చారు. నేను ఏడుస్తున్నానంటే, నాకు భయం ముంచుకొచ్చింది. ఆ రాముడు సామాన్యుడు కాడు. అతనూ, లక్ష్మణుడూ మహా పరాక్రమవంతులు. నా పగా, చచ్చినవాళ్ళ పగా తీర్చ దలిస్తే నీవే వచ్చి ఆ రాముణ్ణి చంపు. ఆ పని చెయ్యకపోయ్యావో నీ శూరత్వం కేవలం దంభమే; అసలు నీవీ జనస్థానంలో ఉండటానికి కూడా అర్హుడవు కావన్న మాట. ఎందుకంటే ఎప్పటికైనా ఆ రాముడు వచ్చి నీ ప్రాణాలు తీసితీరుతాడు. కాదు, రాముడంతటి బలం నీకూ ఉన్నదంటావా, వెంటనే వచ్చి అతణ్ణి చంపు. చంపలేక పోతే అతని చేతిలో చావనన్నా చావు!" అంటూ శూర్పణఖ భోరున ఏడ్చింది.

శూర్పణఖ అందరు రాక్షసుల మధ్య తనను ఇలా అవమానించే సరికి ఖరుడికి పౌరుషం వచ్చింది. "రాముడి పరాక్రమం నేను లెక్కచేస్తానా? నీకు జరిగిన అవమానం తలుచుకుంటే నాకు పట్టరాని కోపం వచ్చేస్తున్నది. ఆ రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ నేనే స్వయంగా నరికేస్తాను. నీవు వారి రక్తం తాగు," అన్నాడు ఖరుడు.

ఖరుడి వద్ద పద్నాలుగు వేల మందితో కూడిన రాక్షస సేన ఉన్నది. దానికి నాయకుడు దూషణుడు. దూషణుడు ఆ సేనను ఆయత్త పరిచాడు. ఖరుడు రథమెక్కి, సేనతో సహా రాముడి పైకి యుద్ధానికి బయలుదేరాడు.

ఖరుడి వెంట పన్నెండు మంది రాక్షస ప్రముఖులూ, దూషణుడి వెంట మరి నలుగురు సేనాపతులూ ఉన్నారు.



105



తన పైకి ఒక పెద్ద రాక్షససేన' వస్తున్నట్టు గ్రహించి రాముడు సీతను లక్ష్మణుడి వెంట ఒక రహస్యమైన గుహకు పంపాడు. వారు వెళ్ళాక రాముడు తన కవచం ధరించి రాక్షసుల రాకను ఎదురు చూడ సాగాడు.

ఇంతలో కోలాహలంగా అరుస్తూ, భేరులు మోగిస్తూ, అరణ్యమంతా మారుమోతలు వస్తూండగా, రాక్షస సైన్యం రానే వచ్చింది. రాముడికి ఎటు చూసినా రాక్షసులు కానవచ్చారు. ఖరుడి రథం రాముడి వద్దకు, పర్ణశాల సమీపానికి వచ్చింది. రాక్షసులు రాముడి మీద బాణవర్షం కురిపించారు.



వాటిలో కొన్నిటిని రాముడు తన బాణాలతో కొట్టేశాడు. కాని రాక్షసులు ప్రయోగించిన ఆయుధాలు కొన్ని రాముణ్ణి గాయపరిచాయి. అయినా అతను పర్వతంలాగా చలించక నిలబడ్డాడు. అయితే రాముడు ప్రయోగించిన తీవ్రమైన బాణాలకు రాక్షసులు చావనారంభించారు.

అనేకమంది రాక్షసులు రాముడి చేత చావగా కొందరు భయపడి ఖరుణ్ణి శరణు జొచ్చారు. దూషణుడు వారికి ధైర్యం చెప్పి తాను రాముడి పైకి వచ్చాడు. అలా వచ్చిన దూషణుడి పైనా, అతని వెంట వచ్చిన రాక్షసుల పైనా రాముడు గాంధర్వాస్త్రం ప్రయోగించాడు. వేలకు వేలు బాణాలు వచ్చి రాక్షసులకు తగిలి వారి ప్రాణాలు హరించాయి. రాముడికీ దూషణుడికీ యుద్ధమయింది. ఈ యుద్ధంలో రాముడు దూషణుడి సారథినీ, గుర్రాలనూ, చివరకు దూషణుడి రెండు చేతులనూ బాణాలతో నరికేశాడు; దూషణుడి వెంట వచ్చిన అయిదు వేల మంది రాక్షసులనూ చంపేశాడు.

క్రమంగా రాముడు, తాను ఒంటరిగాడై ఉండికూడా, పధ్నాలుగు వేల మంది రాక్షసులనూ చంపేశాడు. వారిలో ఖరుడూ,



త్రిశిరు డనేవాడూ మాత్రమే మిగిలారు. ఖరుడి ఆగ్రహానికి అంతు లేదు. అతడు రాముడిపైకి పోతూండటం చూసి త్రిశిరుడు అడ్డుపడి, "రాముణ్ణి నేను చంపుతాను. నీవు చూస్తూ ఉండు. ఒకవేళ రాముడే నన్ను చంపితే తరవాత నీవు అతన్ని చంప వచ్చు," అని బతిమాలాడు. ఖరుడు సరే నన్నాడు.

త్రిశిరుడికీ రాముడికీ భయంకరమైన యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో త్రిశిరుడు తన గుర్రాలనూ, సారథినీ, ధ్వజాన్నీ పోగొట్టుకుని, రొమ్మున బాణాలు తగిలి మూర్ఛపోయాడు. ఆ స్థితిలో రాముడు మూడు బాణాలు వేసి త్రిశిరుడి తల నరికేశాడు.

తరవాత రాముడికి ఖరుడితో యుద్ధం జరిగింది. ఖరుడు రాముడి చేతి బాణాన్ని విరగగొట్టటమే గాక, అతని కవచాన్ని ముక్కలు ముక్కలు చేసి, రాముడి మర్మస్థానాలను తన బాణాలతో ఛేదించాడు. రాముడు నిలువునా రక్తం కారుతూ, అగస్త్యుడిచ్చిన విల్లు తీసుకుని భయంకరమైన బాణాలు ప్రయోగించి ఖరుణ్ణి విరథుణ్ణి చేశాడు. ఖరుడు తన గదను రాముడి పైకి విసిరివేశాడు. అది రాముడి బాణాలతో తుత్తునియలు కాగా, సమీపంలో ఉన్న చెట్టును పెరికి, దాన్ని రాముడిపై వేశాడు. రాముడు దాన్నికూడా తన బాణాలతో ఖండించి, ఖరుణ్ణి ఒక్క క్షణంలో చంపేశాడు.

రాముడిలా ఖర దూషణులనూ, పధ్నాలుగు వేల మంది రాక్షసులనూ చంపెయ్యటంతో దండకారణ్యానికి రాక్షస భయం తీరిపోయింది.

యుద్ధం అయిపోయినట్టు గ్రహించి, సీత గుహలో నుంచి బయటికి వచ్చి, రాముణ్ణి గట్టిగా ఆలింగనం చేసుకుని ఎంతో సంతోషం పొందింది.



# హనుమంతుడి కథ



కేసరి అనే వానరుడి భార్య అంజన. కేసరి సన్యసించి తపస్సుకు వెళ్ళగా అంజన వాయుదేవుణ్ణి ఆరాధించి, ఆయన అనుగ్రహం వల్ల కొడుకును కన్నది.





పుట్టుతూనే ఆంజనేయుడు సూర్యుణ్ణి చూసి పండనుకుని మింగబోయాడు. రాహువు అడ్డొస్తే, వాణ్ణి పట్టుకోబోయాడు. రాహువు వెళ్ళి ఇంద్రుడితో చెప్పుకున్నాడు.





ఇంద్రుడు ఐరావత మెక్కి వచ్చి తన వజ్రాయుధంతో ఆంజనేయుడి హనువుల (గవదల) పైన కొట్టాడు. ఆంజనేయుడు మూర్ఛపోయాడు. వాయుదేవుడికి కోపం వచ్చి ఎటో వెళ్ళిపోయాడు.




గాలి లేక లోకాలు తల్లడిల్లాయి. దేవతలు బ్రహ్మతో మొరబెట్టారు. బ్రహ్మ వెళ్లి వాయువును బతిమాలాడు. వాయువు మెత్తబడ్డాడు, తన కొడుకును తెచ్చి దేవతల ఆశీర్వాదం ఇప్పించాడు.




హనుమంతుడు సుగ్రీవుడికి మంత్రిగా వుంటూ ఋష్యమూకం మీద తల దాచుకుంటూండగా రామ లక్ష్మణులు సీతను వెతుకుతూ వచ్చారు. హనుమంతుడు వారిని సుగ్రీవుడికి పరిచయంచేశాడు.




కోతులు సీతను వెతకటానికి నలువైపులా పోయేటప్పుడు రాముడు తన ముద్రికను హనుమంతుడికే ఇచ్చాడు. కోతులకు సంపాతి ద్వారా సీత జాడ తెలిసింది.







రావణుడు ఎత్తుకుపోయిన సీత లంకలో వున్నది. సముద్రాన్ని దాటి లంకకు వెళ్ళగలవారెవరు? హనుమంతుడే నని మిగిలిన వానరులు నిశ్చయించారు. హనుమంతుడు సరేననివ్వన గాలిలోకి లేచి సముద్రం మీదుగా బయలుదేరాడు. దారిలో మైనాక పర్వతం అతనికి కొంతసేపు విశ్రాంతి ఇచ్చింది. మళ్ళీ బయలుదేరాడు.





సురస అనే రాక్షసి హనుమంతుడి దారికి అడ్డొచ్చింది. అతను సూక్ష్మశరీరం ధరించి సురస కుండా దూసుకుని లంకకు వెళ్ళాడు. లంక అనే రాక్షసిని చావగొట్టి నగరం ప్రవేశించాడు.





లంక అంతా వెతకగా అశోకవనంలో సీత కనిపించింది. హనుమంతు డామెను ఒంటరిగా కలుసుకుని, రాముడి ముద్రిక ఇచ్చి, సీతను తన వెంట రమ్మన్నాడు. కాని సీత ఒప్పలేదు.





హనుమంతుడు లంకలో వనాలనూ, జల యంత్రాలనూ ధ్వంసం చెయ్యసాగాడు. అడ్డొచ్చిన రాకసులను చావగొట్టాడు. రావణుడు పంపిన జంబుమాలినీ, అక్షయ కుమారుణ్ణీ చంపేశాడు.





చివరకు ఇంద్రజిత్తు వచ్చి బ్రహ్మాస్త్రం వేసి హనుమంతుణ్ణి పట్టుకుని బంధించి, రావణుడి దగ్గిరికి తీసుకుపోయాడు. హనుమంతుడి మాటలకు రావణుడు మండిపోయాడు.







హనుమంతుడికి శిక్షగా రావణుడు అతని తోకకు బట్టలు చుట్టి వాటిని అంటించమన్నాడు. తగలబడుతున్న తోకతో హనుమంతుడు లంకంతా తగలబెట్టాడు.

సీత జాడ తెలిసి రాముడు వానర సేనతో లంకకు వచ్చి రావణుడితో యుద్ధం ఆరంభించాడు. హనుమంతుడు రాముడికి వాహనమయాడు. ఇంద్రజిత్తుతో యుద్ధంచేస్తూ లక్ష్మణుడు మూర్ఛపోయాడు.





హనుమంతుడు సంజీవి పర్వతాన్ని తెచ్చాడు. పని అయినాక పర్వతాన్ని ఎప్పటిచోట వుంచాడు. రావణుడితో యుద్ధంచేస్తూ లక్ష్మణుడు మళ్లీ మూర్ఛపోయాడు. హనుమంతుడు మళ్లీ బయలుదేరాడు.





కాలనేమి అనే రాక్షసుడు మునివేషంలో ముందుగానే వచ్చి పర్వతం మీద వున్నాడు. దాహంగా వుందంటే మొసలి కొలను చూపాడు. హనుమంతుడు తనను పట్టుకున్న మొసలిని చంపాడు.





ఆ మొసలి ధాన్యమాలి అనే దివ్యాంగనగా మారి కాలనేమి రాక్షసుడని చెప్పింది. హనుమంతుడు కాలనేమిని కూడా చంపేశాడు. కాని సంజీవిని ఇవ్వటానికి అక్కడి గంధర్వులు ఒప్పలేదు.



హనుమంతుడు గంధర్వులను ఓడించి పర్వతం ఎత్తుకుని వస్తూండగా కాలనేమి తండ్రి మాల్యవంతుడు సపరివారంగా హనుమంతుడి పైకి వచ్చాడు, ఓడిపోయాడు.




రామ రావణ యుద్ధంలో హనుమంతుడు ఖడ్గరోమాదులైన అనేక రాక్షసులను చంపాడు. రామ లక్ష్మణుల చేతిలో అనేకమంది రాక్షస వీరులు చచ్చారు. చివరకు రావణుడే హతుడయాడు.




రాముడి విజయవార్తను హనుమంతుడే సీతకు చేరవేశాడు. అతను రాముడి కన్న ముందు బయలుదేరి గుహుడికీ, భరతుడికీ చెప్పి, రామ పట్టాభిషేకమైనాక తిరిగి కిష్కింధకు వెళ్ళిపోయాడు.




ద్వాపరయుగం వచ్చింది. పాండవులు అరణ్యవాసంలో వున్నారు. భీముడు సౌగంధికాపహరణానికి బయలుదేరి, దారి కడ్డంగా ఉన్న హనుమంతుణ్ణి తొలగమని ఆజ్ఞాపించాడు.





"ముసలివాణ్ణి, కదలలేను," అన్నాడు హనుమంతుడు. భీముడు హనుమంతుడి తోకను పక్కకు నెట్టలేక పోయాడు. రెండు చేతులా పట్టినా అది లేవలేదు.







తాను కోతి అనుకున్నది హనుమంతుడని తెలిసి భీముడు క్షమాపణ చెప్పకుని, కురుక్షేత్ర యుద్ధంలో తమకు సహాయంగా ఉండమన్నాడు. హనుమంతుడు అందుకు సమ్మతించి, అర్జునుడి రథం మీది ధ్వజానికి గుర్తుగా ఉండిపోయాడు.

# 12. అంగ్‌కోర్ థామ్

కాంబోడియాలోని ప్రాచీన హిందూ నగరం. క్రి. శ. 860లో దీని నిర్మాణం ఆరంభమై, 40 ఏళ్లపాటు సాగింది. ఇందులో అనేక రాజభవనాలూ, ఆలయాలూ వున్నాయి. నగరం మధ్య నుండే బయాన్ ఆలయం గోడలపై నాలుగువైపులా ధ్యానముద్ర గల శివుడి ముఖాలు చెక్కి ఉన్నాయి. నగరం చుట్టూ 330 అ. నిడివి గల అగడ్త వున్నది. నగరం చుట్టూ ఎత్తుగా, రాతితో కట్టిన కోట గోడ ఉన్నది.





# ప్రశ్నోత్తరాలు

1. ఎం. వి. అప్పారావు, గుడివాడ

సూర్యుడు, చంద్రుడు, భూమి మొదలగు గ్రహములన్నియు ఇతిహాసము లనుబట్టి దేవతలని నమ్మి వారిని కొలుచుచున్నాము. కాని నేటి సైంటిస్టులు వాటిని గ్రహములను చున్నారు. అవి గ్రహములైనచో మీ యొక్క "చందమామ" ప్రజలకు దేవతలని చెప్పి మోసపుచ్చుతున్నదా?

భూమీ, సూర్యుడూ, చంద్రుడు గ్రహాలన్న సంగతి మనం కళ్ళారా చూస్తున్నాం కామా? కర్ణుడు సూర్య గోళానికి పుట్టాడని ఎవరైనా అనుకుని మోసపోతారా? దేవతలకు సంబంధించిన కథలన్నీ కట్టు కథలనే మనం అనుకోవచ్చు. కట్టు కథలు కూడా మోసమే ననుకుంటే సాహిత్యమంతా మోసమే. మనలాగే ప్రాచీన గ్రీకులు కూడా ఆకాశంలో కనబడే నక్షత్రాలనూ, రాశులనూ ఆధారం చేసి కథలు కట్టి ఇతిహాసాలు రాశారు. అటువంటి కథలను "చందమామ"లో వేశాం.

2. కొప్పాడ రామారావు, విశాఖపట్నం

ప్రపంచములో ఘన, ద్రవ, వాయు పదార్థము కానిది ఏది?

భూగర్భంలో ఉండే "మాగ్మా" అనేదీ, ఆకాశంలో ఉండే "అయోన్"లూ, పరమాణువులోని సూక్ష్మకణాలూ మొదలైనవి ఉండే స్థితిని మన ద్రవ వాయు స్థితులకు భిన్నంగా ఊహించాలి.

3. రాంకిషన్, బాల్కొండ

ఇల్వలుడు బ్రాహ్మణులకు మేక మాంసము పెట్టెను అని చదివితిని. బ్రాహ్మణులు మాంసాహారులా?

ఒకప్పుడు అందరూ మాంసాహారులే. తద్దినాలలో మేక మాంసం ఉండాలన్న నియమం కూడా ఉండేది. మన దేశంలో జైన మతం వ్యాపించిన అనంతరం శాకాహారం పవిత్రమైనదన్న అభిప్రాయం ప్రచారమయింది. జైన మత ప్రభావానికి గురి అయిన జాతులలో బ్రాహ్మణేతరులు కూడా శాకాహారులుగానే ఉంటున్నారు. ఈనాడు తద్దినాలలో చేసే గారెలు మేక మాంసానికి ప్రత్యామ్నాయం. మేక (మేషం) పోయి, మినుము (మాషం) వచ్చింది.

4. *జి. స్వామినాథన్, కాకినాడ*

భీష్ముడిని అర్జునుడుగదా పడగొడతాడు, మరి ధర్మరాజు తాను పడగొట్టాడని వ్రాశారు. ఏది నిజం?

ఒక రాజు తరపున అనేకమంది యోధులు యుద్ధం చేస్తే ఆ యుద్ధంలోని అక్రమాలకు రాజే బాధ్యుడు.

5. *కుమారి జి. సీతారాఘవన్, ఏలూరు*

అణువుల నుంచి ఉద్భవించే పరమాణువు శక్తి ఇంకా ఎక్కువ అంటారు రష్యా వారు. అణుశక్తి ఎక్కువా, పరమాణుశక్తి ఎక్కువా?

సాధారణంగా అందరూ అణుశక్తి అనేదే పరమాణుశక్తి.

6. *యం. పార్థసారథి, వరంగల్*

అరణ్యవాసం వెళ్ళినప్పుడు సీతాదేవికి రామలక్ష్మణులకు మల్లె, శిరస్సుపైన కొప్పు ఉండవలెనుకదా?

అవసరం లేదు. సీత తాపసి వేషం ధరించలేదు. దశరథు డామెకు పధ్నాలుగేళ్ళపాటు సరిపోయే చీరెలూ, ఆభరణాలూ ఇప్పించి అరణ్యవాసం పంపాడు. ఈ ఆభరణాలు ముందు కథలో ముఖ్యపాత్ర వహిస్తాయి.

7. *కస్త్రి గాంధి, రాయవరం*

"రాజైన బానిసపిల్ల" చాల బాగుంది. ఆ కథ ఎన్ని సంచికలతో ముగిస్తారో తెలుపవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

1963 జనవరి సంచికతో ఆ కథ పూర్తి అవుతుంది.

8. *బి. వెంకటరమణప్ప, గూడుపల్లి*

ఊర్మిళ జనకమహారాజు సొంత కూతురన్నారు. సీత ఎవరి కూతురు?

రామాయణం సరిగా చదవటం లేదా? సీత జనకుడి పెంపుడు కూతురు, ఆయనకు భూమి దున్నుతూండగా దొరికింది. ఆమెను అయోనిజ అంటారు.

9. *ఏ. వి. శేషాద్రి, అంబాపురం*

మేఘములు ఒకటికొకటి ఢీ కొనునపుడు ఉరుము ఏర్పడుతుందికదా, మేఘములు వాయు పదార్థములే మరి, అంత చప్పుడు ఎలా ఏర్పడుతుందంటారు?

మేఘాలు ఒక దానితో మరొకటి ఢీ కొనటంచేత ఉరుము పుట్టదు. మేఘాల వెంట విద్యుత్తు ఉంటుంది. భిన్న విద్యుత్తులుగల మేఘాలు ఒక దాన్ని ఒకటి సమీపించినప్పుడు వాటి మధ్య "స్పార్క్" వస్తుంది. అదే మెరుపు, దాని చప్పుడే ఉరుము.

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

వలలో పక్షులు ఏమంటాయ్ ?

పంపినవారు :
పి. సుభాష్‌బాబు, మద్రాసు - 8

Photo by V. Thithu



బహుమతి
పొందిన వ్యాఖ్య

గెలలో పండ్లను తెమ్మంటాయ్!

పంపినవారు:
పి. సుభాష్‌బాబు, మద్రాసు - 8

## నిజమూ - నీడా ★ [రామతీర్థ కథ]

ఒక పసిపాప అప్పుడప్పుడే పాకటం నేర్చుకుంటున్నది. ఒకసారి ఈ పాప తన నీడను చూసుకున్నది. ఆ నీడ దానికి వింతగా కనపడింది. ఆ నీడను అందుకోవాలని పాప ముందుకు పాకింది కాని పాపతోబాటు నీడ కూడా ముందుకు పోయింది.

ఇలా ఎంత శ్రమపడినా పాపకు నీడ చిక్కనే లేదు. ఆ నీడతో ఆడు కుందామని అది చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థంకాగా, పాప ఏడవ నారంభించింది. ఏడుస్తూనే అది తన నీడను అందుకోవటానికి పడుతూ లేస్తూ పాకి, నానా రొప్పూపడుతున్నది.

పాప దీనస్థితి చూసి తల్లి పాప చేత దాని తల పట్టుకునేటట్టు చేసింది. పాప తన తలను పట్టుకుని నీడ కేసి చూసింది.

నీడ దొరికిపోయింది! పాప సంతోషంతో కిలాకిలా నవ్వింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1963 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వలలో పక్షులు ఏమంటాయ్?

రెండవ ఫోటో : గెలలో పండ్లను తెమ్మంటాయ్!

పంపినవారు : పి. సుభాష్‌బాబు,

6/7, సూరమ్మాళ్ స్ట్రీట్, ఎగ్మూరు, మద్రాసు - 8

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

ధర్మరాజు పట్టాభిషేకం యథావిధిగా జరిగి పోయింది. ధృతరాష్ట్రుడు తన కొడుకులకు శ్రాద్ధం చేశాడు. ధర్మరాజు ద్రోణ కర్ణులకూ, ఘటోత్కచాభిమన్యులకూ, విరాటుడు మొదలైన బంధు మిత్రులకూ వేరు వేరుగా శ్రాద్ధాలు చేశాడు. తన కోసం చనిపోయినవారి పేర ధర్మ సత్రాలూ, విడుదులూ, చలివేంద్రాలూ, చెరువులూ నిర్మించటానికి ఉత్తరు విచ్చాడు. ఆయన భీముడికి దుర్యోధనుడి మేడా, అర్జునుడికి దుశ్శాసనుడిదీ, నకుల సహదేవులకు దుర్మర్షణ దుర్ముఖుల మేడలూ ఇచ్చాడు. కృష్ణ సాత్యకులు అర్జునుడి ఇంట వుండిపోయారు.

ఒకనాడు ధర్మరాజు కృష్ణుణ్ణి చూడబోయాడు. కృష్ణుడు మణిమయమైన శయ్యపై వున్నాడు. ధర్మరాజు కుశల ప్రశ్నలకు అతను సమాధానం చెప్పలేదు. ధర్మరాజు కంగారుపడ్డాడు. అంతలో కృష్ణుడు సమాధి నుంచి బయటపడిన వాడిలాగా అయి, "బావా, కలతపడకు. భీష్ముడు నన్ను తలుచుకుంటున్నాడు, నా మనస్సు ఆయన చెంతకు వెళ్లింది. భీష్ముడితో బాటు ఎంతో జ్ఞానం నశించబోతున్నది. నీ వాయన దగ్గిరికి వెళ్ళి నీ సందేహాలన్నీ నివర్తి చేసుకోవటం మంచిది," అన్నాడు.

తరవాత కృష్ణ సాత్యకులూ, పాండవులూ, సంజయుడు మొదలైనవారు భీష్ముడున్న చోటికి బయలుదేరారు. దారిలో అయిదు మడుగులున్నాయి. వాటిని పరశురాముడు క్షత్రియ రక్తంతో నింపాడు. వాటి కథ ధర్మరాజు కృష్ణుడి ద్వారా విన్నాడు.

పరశురాముడు జమదగ్ని కొడుకు. గంధమాదన పర్వతం మీద శివుణ్ణి గురించి తపస్సు చేసి, అనేక అస్త్రాలూ, గండ్రగొడ్డలీ వరంగా పొందాడు. ఆ రోజులలో హైహయ వంశం వాడైన కృతవీర్యుడికి అర్జును డనే కొడుకుండేవాడు. మహా బలశాలి. అశ్వమేధ యాగం చేసి లేదనకుండా దానాలు చేశాడు.

ఈ అర్జునుడి కొడుకులు ఒకసారి జమదగ్నీ, పరశురాముడూ లేని సమయంలో వారి ఆశ్రమం నుంచి హెూమధేనువునూ, దూడనూ ఎత్తుకుపోయారు. పరశురాముడు పగబట్టి వెళ్ళి అర్జునుణ్ణి చంపేశాడు.

అంతటితో ఆ వైరాన్ని పోనివ్వక, అర్జునుడి కొడుకులు జమదగ్ని ఆశ్రమానికి మళ్ళీ వచ్చి జమదగ్ని తల నరికారు.

దానితో పరశురాముడు భూమి మీద క్షత్రియుడు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞ చేసి ఇరవై ఒక్కసారి క్షత్రియులందరినీ ఊచకోత కోసి, భూమి అంతా కశ్యపుడికి దానం చేశాడు. కొంతకాలం బ్రాహ్మణులు భూమి నేలి అరాజకం తెప్పించారు. కశ్యపు డది చూసి, పరశురాముడి గొడ్డలి వేటుకు గురికాక తప్పించుకున్న క్షత్రియ కుమారులకు భూమిని తిరిగి ఇచ్చేశాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



"ఏవిటే! ఇంట్లో **అమృతాంజనం** లేదా?

నాకాలు బెణికిందే ఏం రాయను?"

ఏమో ఎప్పుడు అవసరమొస్తుందో ఎప్పుడూ అమృతాంజనం దగ్గర వుంచుకోవటం ఉత్తమం. అమృతాంజనం యింట్లో వుందంటే మీరు నిశ్చింతగా వుండవచ్చు.




అమృతాంజన్ లిమిటెడ్ 14/15 లజ్ చర్చిరోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.

JWT-AM 1878

# కుటుంబానికి అతి చక్కటి కానుక

కుటుంబానికి కానుక లివ్వ టానికి మంచి తరుణము పండగరోజులు. గృహంలో సర్వ విధాలా ఉపయోగపడే ఉషా కుట్టు మెషీన్ ఆదర్శ మైన కానుక. ఆధునిక డిజైనుతో చేయబడ్డ అన్ని రకముల ఉషా మెషీన్లకు చక్కటి లక్షణములు; నాణ్యత ఉంది, అవి ఎంతో బాగా పని చేస్తాయి. ఇప్పుడు కుట్టుట మంటే, మునుపటికన్నా ఎక్కువ సరదా అన్నమాట.

మెషీన్లు చేతితో, కాలితో నడుప వీలైనవి, మడచుటకు వీలైనవి, చిత్రములతో సహా దొరకగలవు.









సుళువుగా కుట్టండి,
ఉషాతో కుట్టండి.

**ఉషా**

కుట్టు మెషీన్లు

మా వాయిదా కొనుగోలు షరతులకు మీ ప్రాంతీయ డీలరును సంప్రదించండి.

జే ఇంజనీరింగ్ వర్క్స్ లిమిటెడ్,
కలకత్తా-31

# ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు లో

మీ కు

## సేవింగ్స్ అకౌంటు ఉన్నదా?

★ మేము మీకు సౌహార్దమైన, సహాయకరమైన, సమర్థమైన సేవ చేయగలము!

★★ రు. 5/-లతో సయితం మీరు ప్రారంభించవచ్చు, ఎంత చిన్న మొత్తమైనా మాకు కొద్దిపాటి కాదు.

★★★ మీ సొమ్ముపై 3% సాలుసరి వడ్డీ లభించును.

★★★★ వారానికి మూడుసార్లు మీరు సొమ్ము తీసుకోవచ్చును.

నేడే మీ సమీపపు బ్రాంచీలో పూర్తి వివరములు తెలుసుకోండి.

**1962 - బ్యాంకు రజితోత్సవ సంవత్సరము**

ఎం. సిటి. ముత్తయ్యా
చేర్మన్

ఎస్. ఆర్. వి. అరసు
జనరల్ మేనేజరు (అఫిషియేటింగ్)

---

ఆఫీసులోని ఉద్యోగి చెప్పేది: "నేను రాలె కొన్నప్పటినుంచి ఆఫీసుకు శ్రమలేకుండా అతి హుషారుగా వెళ్లగలుగుతున్నాను. నా రాలె చాలా మృదువుగా, తేలికగా పోవడమే దీనికి కారణం."

## రాలె






## బైసికిల్స్‌లో ప్రసిద్ధిగాంచిన మొదటిపేరు

అదనపు సౌకర్యానికై
విట్‌కాప్ సీటు వేసుకోండి




## సెన్-రాలె

SRC-7(

"దీపావళి" సమయమున అందరికి మా శుభాకాంక్షలు



# CHAMPION

# BANIANS

చాంపియన్ నిట్టింగ్ కంపెని,

తపాలుపెట్టె నం. 42 :: తిరుపూరు.

*A request to Subscribers:*

Copies of CHANDAMAMA are posted to Subscribers normally a week or ten days ahead of the release-date. Those that do not receive their copies in time are requested to write to us and their Postmasters before the 10th of the month of issue. Complaints received after the date may not be immediately attended to.

CHANDAMAMA PUBLICATIONS
VADAPALANI :: MADRAS - 26

You can be a Small Selling Agent of CHANDAMAMA in your town or village. Remit Rs. 3–00 by money order, you will be supplied 8 copies. Or if only 4 copies are enough at the start, send Rs. 1–50. You will profit at the rate of nP. 12 a copy. But before sending money please make sure that there is not already an agent.

CHANDAMAMA PUBLICATIONS
VADAPALANI :: MADRAS - 26



# దీపావళికి
## మా అభివందనలు





ప్రపంచంలో ఎక్కడైనా...
అందరికీ మొదటి ఎన్నిక
కాంతిదీపము అంటే
ఫిలిప్స్....



మరి మీకు కూడా ?



మాస్ట్రో 8 వాల్వులు 4 (. రేడియో ధర: 920/-
ధ్వనిలో కొత్త ప్రపంచము!



5 వాల్వులు 3 బాండ్సు ఏ.సి.డి.సి. ధర 265/-



ఏ.సి. కరెంటు 4 బాండ్సు ధర 405/-
'ఆల్ట్రాన్సిస్టర్' మోడల్ 4 బాండ్సు ధర: 405/-

నమ్మదగినవి
శ్రేష్ఠమైనవి






ఆల్ట్రాన్సిస్టర్ టేబిల్ మోడల్, ధర: 690/-



20 వాట్సు 120 వాట్సు వరకు మీటింగులకు
పాఠశాలలకు, పాటకచేరీలకు





ఫిలిప్స్ అధునాతన యాంప్లిఫయర్లు సౌండుసిస్టమ్ శ్రావ్యమైన ధ్వనికి నమ్మకముగా పనిచేయుటకు ప్రపంచమంతా పేరు పొందినవి.

ఆథరైజ్డ్ డీలర్సు:
# మోడరన్ ఆటో స్టోర్సు
కాన్వెంటువీధి..... విజయవాడ-1.
(మారుతీ సినిమా ఎదురుగా)
బ్రాంచి. గాంధీనగరం. విజయవాడ-3.

ఫిలిప్స్
అత్యుత్తమ
బ్యాటరీ ఛార్జర్లు
అనేక రకములు



# నిరాల సబ్బు

ఉతుకు పనిని
సులభము
చేయును

సమృద్ధియగు
(నురుగు ధర్మమూ అని)





## పొదుపు

ఎందుచేతననగా ఒకే ఒక్క
బారుతో ఎక్కువ బట్టలు ఉతుకవచ్చును.



## మేలురకము

అందులో శుభ్రముచేసే గుణము యెక్కువగానుండుటచే
తెల్లబట్టలు మరింత తెల్లగాను, రంగు బట్టలు
ప్రకాశవంతముగాను చేయును.






తుంగభద్రా ఇండస్ట్రీస్ లి., కర్నూలు.

ASP/N-3

చురుకైన గృహిణులకు
టినోపాల్
మాత్రమే
దుస్తులను
మరింత తెల్లగా
చేస్తుందని తెలియును




ప్రతి గృహిణి పొరుగింటి ఆమె కంటె సొగసుగా బట్టలు వేసుకోవాలనుకొంటుంది. తెల్లని దుస్తుల మాటవస్తే ఆమె టినోపాల్‌ను మాత్రమే జ్ఞాపకము పెట్టుకొంటుంది. ఎందుకంటె, టినోపాల్ ఒక్కటే తెల్లని బట్టలను మెరిసేలా మరియు ఎక్కువ తెల్లగా చేస్తుంది.

టినోపాల్ పొదుపు చేకూరుస్తుంది కూడా మామూలు కుటుంబంలో ఒక రోజు ఉతుక్కునే బట్టలకు టీ చెంచాలో నాలుగోవంతు టినోపాల్ చాలు. ఒకసారి టినోపాల్ పెట్టి ఉతికిన దుస్తులు తరువాత 3 లేక 4 సార్లు ఉతుకుకొన్నా ఎక్కువ తెల్లగానే ఉంటాయి.

జ్ఞాపకముంచుకోండి-

కొంచెము
టినోపాల్
తెల్లని దుస్తులను అన్నిటికన్న
తెల్లగా చేయును

టినోపాల్ జె. ఆర్. గెయిగి. ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్క్.






ఉత్పత్తిదారులు :
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్ట్ బాక్స్ 965, బొంబాయి-1.బి.ఆర్.

TEL SISTA'S-SG-171 A

139

# కె. ఆర్. & కంపెనీ

16, స్ట్రింగర్స్ స్ట్రీట్

## మదరాసు-1

ఫోన్: 23019 & 23526 తంతి: "PRESUNDRY"



(ఇండెంటింగు ఏజెంట్లు, దిగుమతిదారులు, కాగితం వ్యాపారులు)

స్టాకునుండి:

అన్ని రకముల కాగితములు, 'కోట్స్' అచ్చు సిరాలు, ముద్రణాలయములకు ఇతర పరికరాలు.



ఇండెంట్లు:

కాగితములు, ప్రాసెస్ కు తుత్తనాగం (జింక్) రాగిషీట్లు, ముద్రణయంత్రాలు, ఇనప సామానులు, అగ్గిపెట్టెలకు రసాయ ద్రవ్యాలు, స్టెయిన్ లెస్ స్టీల్, "కె. జి." జిప్ ఫాసెనర్సు.

పాలితెలిన్ ట్యూబులు, షీట్లు మొదలైనవి తయారుచేయువారు


ఒక
సొగసైన
క్రొత్త డబ్బాలో


జె. బి.
సాల్టో
బిస్కట్లు


J.B.MANGHARAM'S
Salto
Biscuits

